# 40 ఔన్సుల నెత్తురు

40 ఔన్సుల రక్తమునుండి కాని ఒక ఔన్సు శుక్లము ఉత్పత్తి కాదని శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. దీనినిబట్టి శుక్లము ఎంత విలువయైనదో తెలిసికొనవచ్చును. అట్టి శుక్లము మూత్రములోగాని, స్వప్నములోగాని పోవుచున్నచో ఇక పురుషునకు ఇహలోక సుఖమెక్కడ? కాబట్టి సుఖానందములపై దృష్టియున్నచో

## శుక్లనష్టమును

ఎంతమాత్రమును అశ్రద్ధచేయక వెంటనే చికిత్సచేసి శుక్లరక్షణము గావించుకొనవలయును. పలుచబడిన వీర్యమును గట్టిపఱచి అమితముగా వీర్యవృద్ధిని కలిగించు వనమూలికలకు రాజైన రత్నపురుష ప్రధానద్రవ్యముగా చేయబడిన

# రత్నపురుషలేహ్యము

క్రమముగా సేవించుటచే తప్పక శుక్లరక్షణము జరుగును. మరియు ఈరత్నపురుషలేహ్యసేవనమువలన

| | | |
|---|---|---|
| కండపుష్టి | : | కాయపుష్టి |
| బలము | : | ఆరోగ్యము |
| శరీరబింకం | : | జీవితసౌఖ్యం |

పొందుదురు. రత్నపురుషతో అమోఘవీర్యములగు పెక్కు ఇతర వనమూలికలు చేర్చి తయారుచేయబడిన దివ్యౌని రసాయనము. శుక్లనష్టమును సాటిలేక కుదుర్చు మధురమగు మందు. మేహరోగుల పాలిటి వరప్రసాదము.

నెలకు ఒక పౌను. వెల రూ. 3-0-0. తపాలాఖర్చులు ప్రత్యేకము.

రత్నపురుష డిపో,
2/40 పెద్దినాయునివీధి,
మదరాసు.

ఆంధ్రభూమి

సంపుటం : ౧౦. వృష, కార్తీకము : నవంబరు, 1941. సంచిక : ౧

# సంపాదకీయసమాలోచన

**శ్రీ ఎ. బి. రెడ్డిగారి సాహసం**

ఆంధ్రపుత్రులు శ్రీ ఎ. బి. రెడ్డి గారు బొంబాయిలో నెలకొని చారిత్రకగాథలను సినీమాలు తీయడానికి దొరకొన్న సంతోషవార్త మా పాఠకులకు అందజేయడానికి ఆనందితుల మగుచున్నాము. ఉత్తర హిందూస్థానీయులు తమ సినీమాలతో దక్షిణ హిందూస్థానాన్ని ముంచెత్తుచున్నారు. దక్షిణ హిందూస్థానపు సినీమాలు ఏవికాని ఉత్తర హిందూస్థానంలో ప్రదర్శన బాహుళ్యాన్ని అందలేదు. ఆలోపాన్ని తీర్చడానికి దాక్షిణాత్యులైన శ్రీ ఎ. బి. రెడ్డి గారు ఇప్పుడు శ్రద్ధధాను లయినారు. శ్రీవారు భద్రాచల రామదాసు గాథను, విజయనగర విస్మృత గాథను హిందీలోనూ— రాణా ప్రతాప్ గాథను, మొగలాయి దర్బారుగాథను ఇంగ్లీషులోనూ తీయ దలచుకొన్నారు. ఈ నాలుగు చిత్రాలున్నూ 1942 లో పూర్తి కాగలవని వారు ప్రకటిస్తున్నారు. ఇందువల్ల దాక్షిణాత్యుల సినీమావ్యాపారం ఉత్తరహిందూస్థానానికి ప్రాకువెట్టడమే కాకుండా, ఆంధ్రచారిత్రక కథలకుకూడ అక్కడ ప్రచార మేర్పడుతుంది. ఈరెండు కారణాలచేత శ్రీ రెడ్డిగారి ఉద్యమము దాక్షిణాత్యులకు ముఖ్యంగా తెనుగువారికి ప్రశంసనీయమైనది. శ్రీ రెడ్డిగారి ఉద్యమము ఫలోదయాంతం కావాలని 'ఆంధ్రభూమి' హృదయపూర్వకముగా కోరుతూవుంది.

**శ్రీ ఉయ్యూరు రాజావారి రజతోత్సవము**

స్వయంగా కవిపండితులు కావడమే కాకుండా కవిపండితపోషకులైన శ్రీ ఉయ్యూరు రాజా వెంకటాద్రి అప్పారావు బహద్దరువారు ఎస్టేటు పరిపాలన చేపట్టి ఇప్పటికి ఇరవై ఐదు సంవత్సరాలు ఐనది. కాగా ఈసందర్భంలో రజతోత్సవం జరపడానికి కొందరు ఆంధ్రపుత్రులు ప్రయత్నిస్తున్నారు. ఈ ప్రయత్నం ప్రోత్సహింపదగివుంది. ఆంధ్రదేశానికి నడిబొడ్డు ఐన బెజవాడకు కళాశాలను ప్రసాదించిన వదాన్యులు శ్రీ ఉయ్యూరు రాజావారే ఐవుండడం మనం మరిచిపోకూడదు. వారి రాజధానిఐన నూజివీడులోని ఉన్నతపాఠశాల, వాన పాములలోని మిడిలుస్కూలు వారి పోషణలో ప్రోదిగొంటున్నవే. ఈ సంస్థలన్నీ విద్యాదానప్రవణమైన వారిబుద్ధికి నిదర్శనాలు. అట్టివారి రజతోత్సవం విద్యాప్రియుల కందరకు పాల్గొనతగ్గది. కాబట్టి తగు ప్రయత్నాలు సాగుగాక అని కోరుతున్నాము.

**శ్రీ కామమాను రామస్వామిగారి వదాన్యత**

ఆంధ్రుని వదాన్యతకు అనేక నిదర్శనాలు వున్నాయి. ఇప్పుడు మరిఒకటి ఉపలబ్ధమవుతూవుంది. తెనాలి వాస్తవ్యులైన శ్రీ కామమాను రామస్వామిగారు తమకున్న ఆస్తిలో ఏభై వేలు విలువచేసే తెనాలి మెయిన్‌రోడ్డుమీది

నాలుగు పెద్ద మేడల్ని అన్నదానం కొనసాగించే నిమిత్తం ఇచ్చివేశారు. ఆ మేడలవల్ల నెలకు రెండు వందల రూపాయిల వరుమానం రాగలదు. ఆడబ్బుతో నిత్యమూ తెనాలిలో వికలాంగులకు అన్నదానము చేయడానికి ఏర్పాటు జరిగింది. ఈఅన్నదాత సుఖీభూతుడగుగాక ! పరార్థప్రవణమైన రామస్వామిగారి ఈకార్యము పలువురు ఆంధ్రలక్ష్మీపుత్రులకు మేలుబంతి కాదగివుంది.



**శ్రీ మోతే నరసింహారావుగారి ఉచితజ్ఞత**

పశ్చిమ గోదావరి మండలానికి తిలక నగరమైన ఏలూరు పురవరానికి మకుటాయమానమైన జమీందారీ కుటుంబాల్లో మోతే వారి కుటుంబం ఒకటి. ఆకుటుంబానికి చెందిన శ్రీ నరసింహారావుగారు ఇటీవల ఒక విషయంలో తమ ఉచితజ్ఞతను ప్రకటించి ప్రజల మన్ననలకు పాత్రులయినారు. రామచంద్రరావుపేటలోని పార్కునకు శ్రీ నరసింహారావుగారి పేరు ఉంచడానికి ఏలూరు పురపాలకసంఘంవారు తీర్మానించారు. దానికి నరసింహారావుగారు రామచంద్రరావుపేట పార్కునకు తమపేరు వుంచడం తమకు ఇష్టంలేదనీ- తమ అనుమతి తీసుకోకుండ కౌన్సిలువారు అట్లు తీర్మానించి వుండకూడదనీ తెలియజేశారు. తాము పూర్వం ఒకప్పుడు అధ్యక్షులుగావున్న ఏలూరు పురపాలకసంఘం తమ్ము ఇప్పుడు ఈరీతిగా గౌరవింపబోగా వద్దనడం శ్రీ నరసింహారావుగారి వినయసౌశీల్యాన్ని చాటుతూవుంది.



**శ్రీ పి. వి. శేషయ్యగారి మరణం**

తెనుగు సినీమావ్యాపారానికి అర్థ దశాబ్దినుంచి పెద్ద అండగావుండిన శ్రీ పి. వి. శేషయ్యగారు అక్టోబరు 23-వ తేదీని అకస్మాత్తుగా మరణించారని తెలియజేయడానికి మిక్కిలి విచారిస్తున్నాము. తోడి వర్తకులెందరో పాతఫక్కీ వర్తకాల్లో పొరట్లాడుతూవున్న సమయంలో శ్రీ శేషయ్యగారు క్రొత్త వ్యాపారమైన సినీమా వ్యాపారంలో దూరదృష్టితో ప్రవేశించి తాము బాగుపడి, తెనుగు సినీమా వ్యాపారానికి ఒక దీప్తిని ఇచ్చారు. ఆదిలో ప్రొడ్యూసరుగా ఈ వ్యాపారంలో వేలుపెట్టి వారు ఇటీవల కేవలం పెట్టుబడిదారుగా వుండిపోతూ వచ్చారు. నడుమలో ఈడిగలపడిన పెక్కు సినీమాలకు పెట్టుబడిదారుగావుండి వారు జవాన్ని, జీవాన్ని ప్రసాదిస్తూ వచ్చారు. వారి యాజమాన్యాన్ని సరస్వతీటాకీసు లిమిటెడ్ లాభసాటి వ్యాపారసంస్థ ఐనది. అట్టివారి మరణము తెనుగు సినీమా వ్యాపారానికి గొడ్డలిపెట్టు అనకతీరదు. ఆ వ్యాపారకుశలుడు నల్భై ఏళ్ళ నడివయస్సులో చనిపోవడం ఒక విధంగా తెలుగువారి దురదృష్టమే. 'ఆంధ్రభూమి' వారి ఆత్మకు శాంతిని చేకూర్ప పరమాత్ముని ప్రార్థిస్తూవుంది.

నవంబరు నెలలో
విడుదల!

తండ్రీ!
...మాధవసింహుడు ముస
లివాడు. నేనతనిని వివాహ
మాడను. నన్నాతనికిచ్చి నవ
నవలాడు నాయవ్వనమును
ఏల ధ్వంసము చేసెదవు?
"విషయ"



సూర్యకుమారి
మాధవపెద్ది
పులిపాటి
నటించిన

వాణీ వారి

# చంద్రహాస

SARMA VS

బుకింగువివరాలు :
ఫేమస్ ఫిలింమ్సు
నెల్లూరు.

ప్రొడ్యూసర్సు :
వాణీ పిక్చర్సు
మైలాపూరు.

దత్తమండలములకు :
శ్రీసత్యనారాయణఫిలిమ్సుసర్క్యూట్
కర్నూలు.

# మేలుకొలుపు

రచయిత :
మాడపాటి నరసింహయోగీంద్రుడు.

ప్రొద్దూ పొడవావచ్చె పోనివ్వరా కృష్ణ
నీ నాడా వున్నాను లేరా
మానారో నేనత్తా మామాలుగలదాన్నీ
మాటాలూ వచ్చానూ లేరా
ఇరుగుపొరుగుసొమ్మ్లో ఎరువూ బెట్టుక నేను
ఇటు జేర వస్తిని లేరా
బలువైనా ముత్యాల బాష్లీ చెవ్వునా లేదు
పరుపూలో వెతకాలె లేరా
పరులాసొమ్మ్లో పోతె పదిమందిలో నాకు
ఆటూ తగూలాయె లేరా
వనజాక్షురో నేడు వదినేకు క్రొత్తంగా
వరలక్ష్మి వ్రతమాట లేరా.
పనులాకు రమ్మని బ్రతిమాలాడి పోయె
రేపల్లె పోవాలె లేరా
అందారూగలదాన్ని అయినయింటీ బిడ్డా
నారాడి సేయాకా లేరా
మందిలోకి నామగడూ పండీతూడు
మార్గజపూజితుడు లేరా
ఖండనము వేసినా నాముక్కూపోగు
నీకుడిప్రక్కా వున్నదిరా లేరా
సందీటి దండాలు నీభుజకీర్తులలోనూ
సందూలో బడ్డావీ లేరా
సొగసైన ముత్యాల భన్నస్వరమ్ములూ
పమిటేలో పడ్డావీ లేరా
హెచ్చైన రత్నాల పేరూల పయ్యాబట్టి
పెనిగితే పెరిగిందీ లేరా
మెచ్చినీవిచ్చినా మేలీమీ బంగారు
మెడనా ముడివీడిపోయె లేరా
తీరైనా ముత్యాలా పాపిట చేచుక్క
బిందినీలు లేవాయ లేరా
అరుదైనా రాగిడి చంద్రాహారమ్ములు
అవి చిక్కూ బడ్డావి లేరా

విరలాదండలా పూలు కొప్పూవజిక్కేనూ
విడిపింతూ వూగాని లేరా
సరసంపు జెడబిళ్లా లదరీచూచితే వెన్నూ
అవి గానపడలేదూ లేరా
కంకణాలు మంచీ పోచీలూ చేతూలకు
సూడీగా లేవాయ లేరా
బాగైనా పాంజేవులూ పావాడాలందేలు
సీలా లూదిలీపాయ లేరా
బంగారు జలతారూ పసినీపట్టు చీరె
కొంగూ మాసిపోయె లేరా
పమిడీ పువ్వులూ వేసీ బాగాకుట్టిన రెవికే
పికిలీ నట్టున్నాదీ లేరా
హెచ్చైనా వజ్రాణ మేమూంయెనో మాట
వచ్చి దిగ్గునా చూచి లేరా
ముద్దూగులికేటి నీ వ్రేలీముద్రికా లేదు
బుద్ధిమంతుడా వేనూ లేరా
రద్దీపాలూసేసి రంకూబైటూవేసీ
రచ్చాలా బెట్టూకా లేరా
వచ్చినా నేరానా వంటీసొమ్ములన్నీ
వదలించే దెబ్బగానూ లేరా
సంతోషంబున నీదూ సన్నిధీ కొచ్చితీ
సరసామూ జాలింకా లేరా
ఎంతా వేడూకొన్నా సుంతైనా దయలేదు
ఇంతా పారాకేలా లేరా
నాసాటీ వారిలో నగుబాటూ లేకుండా
నాసిగ్గూ దక్కించీ లేరా
నీసాటీ వారీలో మోసాము రాకుండా
నీ పరువూ దక్కించా లేరా
రచ్చానా నీసాటీ రాజూలూ వింటేను
రద్దీవచ్చునుకృష్ణా లేరా
పనసా వేదీవంటి దొరసానీ రుక్మిణీ
సరసానుందూ గానీ లేరా

ఎన్ని జెప్పిన వినవూ ఏమి సేయుదు నేను
ఎంత శ్రీపతుండావో లేరా
గోవిందా నీవంటీ కొడుకూబుట్టూననీ
కోరి పొందికకో స్త్రీ లేరా
అవాంఛాఫలమూ నేడౌనో కాదో వెఱ్రి
ఆశాలూపడిన స్త్రీ లేరా
నీ వయ్యారముజూచి నేవలచీవచ్చితీ
నేరమ్మేనాదింకా లేరా
కావారమ్ము మోహాకాంతూదీరుటకోఱకు
కలసిందె నాతప్పా లేరా
నీవల్లా గర్భిణీ నిలిచీనందుకు చాలా
నిలుచూనా నిలవాదో లేరా
యీవాళ నే యిల్లు జేరితే నాకిక
కొడుకూబుట్టీనట్లే లేరా
వూరంతా లెస్సాగా వుడుకూ ముగ్గాటి స్త్రే
ఒక్కర్తె నేన స్త్రీలేరా
దారీలో మెదిలేటి దయ్యాలభయమూయె
తప్పించూకొనిన స్త్రీ లేరా
చిగురాకూవీడెమూలా నోరూ లెరుపూలాయె
అదినీల్లా గడగాలె లేరా
అగరూగంధముబూయ నదివద్దనంగాను
అది తుడుచూకోవాలె లేరా
పోగడా పువ్వూలాదండా పొందూరాగిడిచుట్టూ
పోదిగీ నాపూవిడతూ లేరా
నిద్రా లేనిగుర్రూ వెట్టూచూ దుప్పాటీ
మెడనిండా కప్పేవూ లేరా
ఇల్లూ చేరువగాదు యీవాళ వేగానె
ఇల్లూచేరావలె లేరా
అందారూచూచితే ఆడికాలొచ్చునీ
కాళ్లాకూ మ్రొక్కేదా లేరా
వల్లాజూచి రేపూ వచ్చేదాగాని
శ్రీవల్లాభా యింతాటా లేరా
కల్లాగాదు దిక్కూ లెల్లా తెల్లానాయె
నల్లానీ నాస్వామీ లేరా
ఎందారేమన్నా నీపొందూబాయానింక
దణ్ణాము పెట్టేను లేరా

మందీ నేరనిమఱుగూ మంద్దె నాపెట్టేను
మఱినిన్నే మరిగేను లేరా
పన్నూగా నిన్నెడా పాయూనానిబాసా
లెన్నైన్నాజేసేను లేరా
అత్తామామాకన్నా ఆజ్ఞ సేసె తాత
ముత్తావలున్నారు లేరా
తిన కారుచులూ చెప్పే ధీరుడూమామామ
దేశాదిమ్మరివాడూ లేరా
వినకా కథలు సెప్పే విధమూ నేర్చిన శుష్క
వేదాంతి మా బావ లేరా
కనకావై ఖరీ రాజ ఘనుచిత్రాకారుండు
గడుసూవాడూ మఱది లేరా
వెనకాదియ్యక తప్పూ వెదకందే వుతుకూను
వెఱ్ఱీవాడూ మగడూ లేరా
నీళ్ళల్లో జాడాలు నెఱదీయు మాఅత్త
కూంళ్ళామారీతొత్తు లేరా
చిత్త చెంచలాబుద్ధి చిత్రాంగీవంటీ చి
న్నత్తాకొంపలా గుత్తా లేరా
మెత్తానీ గుణము మేనత్తాకూతురూకత్తి
పసునూవంటిదీస్వామి లేరా
కొత్తాదీ నాతోడూకోడాలు తిత్తీలో
కొడవాలీవంటిదీ లేరా
గోళ్లా చప్పిళ్లాయె కోళ్లాగుంపులూకూసె
సిల్లాకూ వెళ్లాయె లేరా
గొల్లాభామలు రేపల్లెవాడానుంచి
చల్లమ్మావచ్చిరీ లేరా
ముసలీదీ వాకిటా కసుపూడ్చె వెళ్లాయె
దణ్ణాము పెట్టేను లేరా
తెల్లావారవచ్చే తెలుపాయె దీపాలు
వీధీలో మెదిలాడు లేరా
తలుపూదీసి నన్నూ దాటించూనా స్వామి
కరుణించి నామీదా లేరా
భాసురమ్ముగా మూడాపాటి నరసింహయోగీ
దాసూనేలినాస్వామీ లేరా
కృష్ణా లేరా! స్వామీ లేరా!

# భర్త అనురాగం పొందాలంటే భార్య ఆత్మపరీక్ష చేసికోవాలి

సంభాషణలోని ప్రమాదం లేనిజారుపాట్లకు కూడా నాభర్తని సవరిస్తూ వుంటానా?

ఫలాని పురుషుడంత చురుగ్గా మీరుకూడా వుండివుంటే ఇంతకంటె ఎక్కువడబ్బు సంపాదించి వుండేవారని నాభర్తని ఈసడిస్తూ వుంటానా ?

ఇరుగు పొరుగు భర్తలు వారి వారి ఇళ్ళమీద హెచ్చుశ్రద్ధ చూపిస్తున్నారని నాభర్తని బాహాటంగా దెప్పుతూవుంటానా ?

కావాలని గాఢంగా కోరి కొనుక్కోలేని వస్తువులకోసమని భర్తయెదట బహిరంగంగా నిట్టూర్పులు నిగిడిస్తూవుంటానా ?

చుట్టాలనడుమవుండగా డబ్బుకోసమని ఆయన్ని తేలికపరుస్తూ వుంటానా ?

ఏదైనా చెబుతూవుండగా మధ్యలో ఆయనమాటలకు తరుచు అడ్డంవస్తూ 'డబాయించకండి, కోతలు కొయ్యకండి' అంటూ చులకనచేస్తూవుంటానా?

నెలవురోజుల్లో సాయంకాలం భర్త షికారుకుపోతానంటే మీ మొగానికి షికారుకూడా ఎందుకు అంటూ ఇకిలిస్తానా ?

ఆయనస్నేహితులు ఎవరూ మంచివారు కారని తరుచు విమర్శిస్తూ వుంటానా ?

ఇంటికి ఆయన కొంచెం ఆలస్యంగావస్తే క్రాస్‌ప్రశ్నలు వేసి విసిగిస్తానా ?

పిల్లలతో మాట్లాడేటప్పుడు 'అబ్బో! మీనాన్నకు ఆమాత్రం కూడానా?' అని లాఘవంగా పలుకుతూవుంటానా ?

ఏవిషయాన్ని గురించైనా గాఢంగా ఆలోచిస్తూవుంటే మధ్యలోవెళ్ళి ఆయన్ని చీకాకుపరుస్తానా ?

ఆయన ఏదేనా నాశ్రేయస్సు కోరి మంచిమాట చెప్పబోతే అట్లాంటిమాటలు చెప్పకండి, నా ఒళ్లు మండిపోతుంది' అంటూ తృణీకరిస్తానా ?

ఇప్పుడేనా నిజంచెప్పండి, ఈ పని ఇప్పుడే చేస్తారా చేయరా అంటూ నాభర్తని ఎదురుకుంటూ వుంటానా ?

# నెలబిడ్డ

పుట్టినప్పుడు బిడ్డ 5½ మొదలు 9 పౌనులతూకం వుంటుంది.

అప్పటినుంచి వానికి 3 మొదలు 6 ఔన్సులవరకు తూకాన్ని పెంచుతూవుంటుంది.

నెలబిడ్డచర్మం దృఢంగా, పాటలవర్ణంగా వుంటుంది.

తనతల్లిపోల్కి స్థూలంగా తెలుసుకోగలిగివుంటుంది.

పాలుతాగడం, నిద్రపోవడం, మలమూత్ర విసర్జనం—ఈ పనులను కాలప్రకారం చేయడానికి అలవాటుపడగల స్థితిలోవుంటుంది.

నెలబిడ్డకు తలబోనులు ఇంకా అతుక్కునివుండవు. తలమీద ఒక చిన్న చతురం చాలామృదువుగా వుంటుంది.

ఊపిరిపీల్చేటప్పుడల్లా గుండె ఉబ్బునుపొందుతూవున్న విషయం బాగా కనిపిస్తుంది.

నెలబిడ్డ గుప్పిళ్లు బాగా పట్టుతుంది.

పాలుతాగాలనే అభిలాష గాఢంగా వుంటుంది.

వెలకిలా పరుండివుంటుంది.

సాధారణంగా అస్తమానూ నిద్రపోతూనేవుంటుంది.

మేలుకునివుంటేమాత్రం కాళ్లు చేతులు ప్రబలంగా కదుపుతూ వుంటుంది.



# నాచనసోముని 'ఊర్వశి'



'సాహిత్యరసపోషణసంవిధాన చక్రవర్తి' ఐన నాచన సోమనాథుడు పోషించి మన కిచ్చిన స్త్రీపాత్రలలో ఊర్వశి ఉపశోభితమైనది.

తాను రచించిన ఉత్తరహరివంశంలో నాచన సోమనాథుడు ఊర్వశి ఉదంతాన్ని లెక్క పాతిక పద్యాల్లో ప్రస్తావించివున్నాడు. ఆపాతికపద్యాలున్నూ మంచి పరువంగల పాకంలో పడ్డాయి.

ఊర్వశిపాత్రను తెనుగు కవులు పలువురు చిత్రించివున్నారు. కనుపర్తి అబ్బయామాత్యుడు తన కవిజనరంజనంలోనూ, శ్రీనాథుడు తన హరవిలాసంలోనూ ఊర్వశిపాత్రను మనోహరంగా పోషించివున్నారు.

కవిజనరంజనంలో ఊర్వశి పురూరవుని దేవరిగా తీవరకత్తెఐనది. హరవిలాసములో ఆమె అర్జునుని వలచివచ్చి వలపించుకోలేక ఇచ్ఛాభిఘాతాన్ని పొందిన ముసలిముద్దరాలయినది.

ఇక ఉత్తరహరివంశములో ఆమె ఏమైనదో కొంచెం చూద్దాము.

యుద్ధంలో ఇంద్రుణ్ణి ఓడించి నరకాసురుడు 'సంగరవిజయోత్సాహం'తో అమరావతిలో ప్రవేశించాడు.

'భాసురంబగు జంభారిమందిరం'ప్రవేశించి నరకాసురుడు చేసిన మొదటిపని ఏమిటి?

తాను రాకపూర్వమే అక్కడినుండి అంతఃపుర కాంతలు తొలగిపోయారని తెలుసుకోవడం, విజయోల్లాసివిన నరకుని మనస్సు అప్పుడే విషయవాంఛల మీదికి మరలిందన్నమాట.

విషయవాంఛాపూర్ణమైన చిత్తంతో అతడు జంభారిసభామండపంలో ప్రవేశించి అచటి ఉన్నత రత్నసింహాసనంమీద ఆసీనుడైనాడు.

రత్నసింహాసనంమీద కూర్చుని అతడు చేసిన మొదటి రాచకార్యం ఊర్వశిని తోడితెమ్మనడం.

ఊర్వశిని తోడితెమ్మని అతడు ఒక్కణ్ణే పంపడు. కాని ఆరాజాజ్ఞ నిర్వహించడానికి పదిమంది పరుగెత్తారు. రాజుకు తగ్గ సేవకులు. ఆరాక్షసరాజు చిత్తం రామమీదికిపోవడం కాముకులైన ఆరాజసేవకులకు చంకలుతాటించే విషయమైంది.

సేవకులు ఊర్వశికోసమని సౌపర్వాణసౌధవీథుల యుపాంతాల్లో వెదకడానికి ప్రారంభించారు. అట్టే సేపు వెతకనక్కరలేకుండానే వారికి ఊర్వశి కనిపించింది.

వారిని చూచి ఊర్వశి తప్పించుకుపోవా లనుకున్నది. కాని ఆమెను తీసుకు వెళ్ళడనికే వచ్చిన వారు ఆమెను ఎందుకు వెళ్ళిపోనిస్తారు!

'తొలగిపోవడం దేనికి? మారాజు నిన్ను తోడితెమ్మన్నాడు. నిన్ను తీసుకువెళ్ళడానికి ఎంతమంది నెట్టుకుని వస్తున్నారో చూడు' అన్నారు వారు ఊర్వశితో.

రాక్షసరాజు కబురుపంపాడంటే ఊర్వశికి 'జడుపుంజెమ్మటలు' పోయలేదు. 'అజ్జోటి దిట్టగావునందలంకక' వస్తూవుంది.

ఇప్పుడు ఆమె తలంకకపోవచ్చు. నరకుడు ఇంద్రుణ్ణి జయించిన సమయంలో ఆమెకు జడుపు జనించివున్నది. కావుననే 'మునుముట్టిన భయకారణంబున' ఊర్వశి ఇట్లా వున్నదని కవి వర్ణిస్తున్నాడు:

సీ. తొడవు లూడ్చినవైనఁ దొయ్యలిరూపుతోఁ
జిన్నపోయినపట్లు చెన్నుమీఱు
విరులు పుచ్చినవైన వెలఁది పెన్నెఱితావిఁ
బాయని జవ్వాది బయలు మెఱయు
బూఁత రాల్చినవైనఁ బొలఁతుక మైచాయ
గవుసెన పుచ్చిన క్రమముదెలుపు
మడుఁగు మాసినవైన మగువపిఱుందు పో
యగము జూపఱచిత్త మాఁకగొలుపు
తే. మురిపములు నుజ్జగించిన ముగుదనగుపుఁ
గలికిచూపుల వీడ్కొన్న కన్నుఁగవయుఁ
జిఱునగవు నోసరించిన చిగురుమోవి
నింతి మది భీతి వెలువీడు టెఱుకసేయ.

ఇట్లు అభివర్ణితమైన ఊర్వశి నరకుని ఎదుటికి వస్తూవుంది.

అప్పుడు అతడు ఏస్థితిలో వున్నాడు? 'సురపుంగపు గద్దియమీఁదనుండి గంధర్వులపాట వించుఁ బ్రమదంబు' పొందుతూవున్నాడు.

'ప్రమదంబును' పొందుతూవుండి అతడు ఆతలోదరిని అల్లంతదూరాన్నే తిలకించాడు.

తోడనే తలముడి నిమురుకొన్నాడు; ఖండువా సవరించుకున్నాడు; పచ్చపూ మొగలిరేకుమీద గోళ్లతో గీతలు వ్రాస్తున్నాడు. కులుకుకోర్కెలు తేలుతున్నాడు.

ఈ విధమంతా ఊర్వశి చూచింది. వాడు 'చేతోజాతాయత్తుండై' తన్ను పిలిపించాడని చిత్తంలో తెలుసుకున్నది.

కాముకవ్యాపారంకోసం తన్ను అతడు రావించాడని ఆకళింపు కావడంతోటే ఆమెకు సిగ్గువచ్చింది.

అప్పటి ఆమెస్థితిని కవి ఇట్లు కమనీయంగా వర్ణిస్తూవున్నాడు :

ఉ. తోరపుఁజన్నుదోయిపయిఁదొంగలిఱెప్పలబాఁచి చూపునీ
పారము లేని క్రొమ్మెఱుఁగులై నిలువంగొలువల్లఁ జొచ్చి య
చ్చేరువ కంబముం గదిసి చిత్తరువో కరువో యనంగ గం
డారపు బొమ్మవోలె నచటం గదలించుకలేక యుండఁగన్.

ఆలలితాంగిని చూచి నరకాసురుడు నెమ్మదిగా సంభాషణ ప్రారంభించాడు. 'ఇంద్రుడు నాతో యుద్ధంచేసి ఓడిపోయాడు. భయపడి దేవకాంతలు దాగుకొన్నారు. నాహొత్తులదానవు కాబట్టి నీవు తొలగిపోవలసిన అవసరంలేదు.'

ఈవిధంగా తనవాంఛను అతడు గడుసుతనంగా తెలుపుకొన్నాడు. అమీద ఆమెను ఉబ్బవేశాడు. ఆమె లేకపోతే తన నాకవిజయం పూర్తి కాదన్నాడు.

ఉ. నాకపురంబులో మెఱసి నందనకేళిఁ జరించి దివ్యకాం
తాకరతాలవృంతసముదాయసమీరముసోఁక రాజ్యముం
గైకొని నేఁడు దిగ్విజయగౌరవధన్యుఁడనైన నాసభన్
నీకనుదోయివెన్నెలలు నిండక కోర్కులు నాకునిండునే.

ఈ ఉబ్బవేయడం ఒక్కటీ చాలదనుకుని అతడు ఆమెకు సొమ్ములఆశ చూపించాడు.

'ఇంద్రుడి రథాలు అవిగో, కుబేరుని ఏనుగులవిగో, వరుణుని గుఱ్ఱాలవిగో, యముని వీరావళులవిగో—ఈసొమ్ములో నీకు ఇష్టమైనవి తీసుకో.' అన్నాడు అతడు ఊర్వశితో.

రథాలు, ఏనుగులు, గుఱ్ఱాలు స్త్రీ ఏమి చేసుకుంటుందనే చింత అతనికి లేకపోయింది. అవి స్త్రీలు కోరే సొమ్ములుకావనే తలపు అతనికి లేకపోయింది. తనగెలుపు ఏదోరీతిని ఆడంబరంగా ఆమెకు తెలుపుకోవడమే ఆహార్యావేశలఘుచారిత్రుని సంకల్పం.

ఇంతలో అతనికి ఊర్వశివంటి దానిని మాటలతో తృప్తిపరచడం సులభంకాదని తోచింది. అప్పుడు అతడు ఆమెతో ఇట్లా అన్నాడు.

ఉ. కౌఁగిటికాసచేసి నొడికారితనంబున నిన్నుఁ దేల్చి రా
రాఁగొఱగానివాఁడనయి రామలలో నగుఁబాటుదేను నీ
కేఁగలుగంగ సంపదలకేల విచారము? పద్మగంధి! నీ
లోఁగిటఁ జేర్పనే యుభయలోకసుఖంబులు నన్నుఁ బొందినన్.

కావడానికి ఊర్వశి దిట్టయే. కాని తన అప్పటి స్థితికి ఆమె చింతాక్రాంతఐనది. అయితే చింతాక్రాంతచిత్తంతో వుండిపోయే పరిస్థితి కాదది. కావున ఆమె వెంటనే తెలివితెచ్చుకుంది. మాటల్లో నరకుణ్ణి పందిరివెట్టడానికి ప్రారంభించి ఇట్లా అడిగింది.

చ. చతురవచోవిలాస! గుణసాగర! సాగరమేఖలావనీ
పతివగు నీకు నింతు లొకభ్రాంతియె నీవిటుగోరుటెల్లనా
యతులితభాగ్య మింత నిజమైనఁ గలంగకమున్న వైభవో
న్నతి మెఱయంగవచ్చి యొకనాఁడయినన్ నను గారవించితే?

తనకు రథాలు, ఏనుగులు, గుఱ్ఱాలు సొమ్ములుగా ఇస్తానంటూ వాడు ఎంత అసంగతంగా మాట్లాడుతూవున్నా ఆమె వాడిని చతురవచోవిలాస అనిపొగిడింది. గుణసాగర అని స్తుతించింది. సాగరమేఖలాపతివని ఉబ్బవేసింది. నీవంటివారికి స్త్రీలు ఒక లెక్కకాదన్నది. అది ఒకవిధంగా తాను అతనికి కోరతగినదికాదని దెప్పిపొడవడమే.

అయితే ఈదెప్పిపొడుపు ధ్వనితో అతనికి కోపం వస్తుందేమో అనేభయం ఆమెకు కలిగింది. కాబట్టి తోడనే ఆమె నీవు నన్ను ఈవిధంగా కోరడమంతా నాభాగ్యమన్నది.

అట్లా అన్నంతమాత్రంచేత అతడు పక్కన వేసరుతాడేమోఅని ఆమె భయపడి కాలవిలంబనం కోసం అతనిమీద ఏదో నెపం మోపడానికి దారకొన్నది.

''నీకు నిజంగా నామీద ఇంతఅభిమానమే వున్నట్లయితే ఈయుద్ధపుగొడవలకు పూర్వమే నీవు 'వైభవోన్నతి మెఱయంగ' వచ్చి ఒకనాడయినా నన్ను గౌరవించావా?'' అని అడిగింది.

ఊర్వశి పాచిక పారింది, నరకుడు ఆమాటలకు మోదితుడయినాడు. నవ్వుతూ అతడు ఆమెతో ఇట్లా అన్నాడు.

'ఏదో వంకదొరికిందికదాఅని దెప్పుతూవున్నావు. రంకుపనికిగాను నేను దేవతలుండిన వీటికి వచ్చి వుండవలసిందా ? నేను ఇక్కడికి లావునరాక వేఱొకతలపున వస్తే కీడుపుట్టదా ?'

ఈ ప్రశ్నకు తడుపుకోకుండా ఊర్వశి ఈవిధంగా జబాబు చెప్పింది.

'మనస్సులో నీకు అంతటి అనుమానంవుంటే నీ విహరించుచోటికి నన్ను ఒకసారైనా పిలపించకూడదా? ఆమాత్రం చనువు నాకు చెల్లదా ?'

ఊర్వశి తన నుడికారితనాన్ని అంతా చూపి ఇట్లాఅన్నమీదట నరకుడు ఏమంటున్నాడో చూడండి:

క. పగవాఁడట దేవేంద్రుఁడు
మగువా! నీ పతనికొలువుమానిసి పఁట నిన్
దగవుచెడి పిలువఁబనుచుట
మగతనమే ? యిట్టి లంజెమాటలు గలవే ?

ఊర్వశివి లంజెమాటలట! తానుకూటమికోసం ఆసపడేస్త్రీని బహిరంగంగా ఇట్లా అనగల తెంపరితనం నరకాసురునివంటి రాక్షసుడికే చెల్లుతుంది. మోటుమానిసి కావున మోటుసరసం చేశాడు.

అవడానికి ఊర్వశి దేవవేశ్యయే. ఐనా మొగం ఎదుట వేశ్యనైనా లంజ అంటే కోపంరాకమానదు. నరకుడు తన్ను లంజ అన్నందుకు ఊర్వశి విచారించింది.

ఐనా విచారాన్ని చూపడానికి అది తగిన అదును కాదు. కోపాన్ని వెలిగ్రక్కటానికికూడా అది సమయంకాదు.

దిగమింగిన విచారమూ, కోపము ఆమెలో ఉడుకారడానికి ఆరంభించాయి. కాబట్టి ఆమె ఇట్లా అన్నది:

ఉ. లంజియనాఁడు నేను విను లావున నీ వమరేంద్రుఁ గెల్చి న
న్నుం జెఱవట్టి తెమ్మని వినోదము చేసితి గాక చిత్తమె
ల్లం జెడియుండ రిత్తయొడలం జవిచేరునె చిల్కవోయినం
బంజరమేమిసేయు రసభంగము సంగతిలోన మెత్తురే ?

ఎంతటి గడుసుమాటలో చూడండి. 'నేను లంజెనే. ఆమాట నేనూ ఒప్పుకుంటున్నాను. నేను లంజెననేమాట నేనుఒప్పుకోవడం నీవు వినతగ్గది కదా! అమరేంద్రునిగెల్చిన అధికబలశాలివి నీవు ఈ లంజెకోసం ఆశపడుతున్నావని అనుకోవచ్చునా? నన్ను పట్టితెమ్మని ఏదో వినోదం చేశావు. చిలక పారిపోయిన పంజరంలాగున చిత్తమంతా చెడివున్న నారిత్తశరీరం నీకు రుచి అవుతుందా ? నీవంటివారు సంగతిలో రసభంగం మెచ్చుతారా?'

ఈ మాటలలో ఉపాలంభన, ఉపలాలన రెండూ గర్భితమైవున్నాయి. ఎట్లాఐనా తప్పించుకుపోవాలనే ఉద్దేశం ఈమాటల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తూవుంది. తప్పించుకుపోవడానికి ఈ మాటలు చాలవని ఆమె ఇంకా ఇట్లా అన్నది.

ఉ. నవ్వులమాటలో? నిజమొ? నాకములోన ననేకకన్యకల్
మవ్వపుఁదీఁగెలం దెగడుమానినులుండఁగ సంత నెన్నఁడో
జవ్వన మమ్ముకొన్న కడసారె ననుం గవయం దలంచితే
పువ్వులు వేడుకైనఁగడిపోయినవే న్కుడువంగ వచ్చునే.

నరకుడు తనపట్ల ఉపయోగించిన లంజెపదాన్ని ఊర్వశి ఇక్కడ వ్యాఖ్యానించింది. తాను సంతలో ఎప్పుడో జవ్వనాన్ని అమ్ముకున్న ముసలమ్మనన్నది. స్వర్గలోకంలో మవ్వపు తీగెలను మించిన మగువ

లుండగా తనవంటి ముసలిలంజెను నరకుడు నిజంగా కోరుతున్నాడా? లేక వేళాకోళం చేస్తున్నాడా? ఏమంటే, పువ్వులు వేడుకయినంతమాత్రంచేత వాడిపోయిన వాటిని తలలో పెట్టుకుంటారా?

ఊర్వశి ఏ ఉద్దేశంతో ఈ పలుకులు పలుకుతూవుందో నరకుడు గ్రహించాడు. గ్రహించి ఇట్లా అన్నాడు:

'నేను నీ చెంతకు రాకుండా ఎత్తులు వేస్తున్నావు. నిన్ను వాడిపోయిన పువ్వులతో పోల్చుకుంటున్నావు. కాని నీసంగతి నాకు తెలుసు. లంజెతనంలో నీవు పడుచుపిల్లల్ని కూడా మించుతావు. ఎంత తఱిగినా మిరియాలు జొన్నలకు సరిపోకుండా వుంటాయా?'

తన మనస్సు అతగాడు ఆకళించాడని ఆమె తెలుసుకొన్నది. ఇక మనసు విఱుపుమాటలు పని చేయవనికూడా తెలుసుకున్నది. విజయదర్పితుడై వున్న అతణ్ణి ఇపుడు ఆదర్పాన్ని ఉబికించే పద్ధతిలో పందిరి వెట్టాలికాని గత్యంతరం లేదని ఆమె నిజమరసింది.

అరసి మాటలాడ్డానికి ముందుగా అతనిదిక్కు మొగమై 'చిఱుతనగవుల తెప్పల సిగ్గు తేర్చి'ంది.

'నీవు రాజవు. మాటల్లో నిన్ను మించడం నా తరంకాదు. కాబట్టి నాది ఒక విన్నపంవుంది. దయచేసి అది వినవలసింది' అని ప్రార్థనాపూర్వకమైన ప్రియోక్తులు పలికింది.

ఆమీద అందుకొన్నది:

చ. శతమఖుఁడో డె నీ వతని సంపదకంతకు రాజవైతి త
చ్ఛతరవిలాసినీగణము సంతత సేవ యొనర్చు నీ మనో
హితముగ నింక నేనన(గ నెంతటిదాన మహిన్ మహోము
నుల్
క్రతువులు సేయుచోటి కధికారివిగాని కొఱంతయేటికిన్.

అన్నీవుండి యాగభాగాలు లేనిలోటు ఒక్కటే నీవంటి వీరుడికి వుండతగింది కాదన్నది. యాజకులు నిన్ను 'యజ్ఞభాగభ్రాజిష్ణుని'గా చేస్తే నేను నిన్ను 'భావజసౌఖ్యావ్యాజపదరాజు'గా చేస్తా నన్నది. పైగా అక్కడ ఒక లోకనీతినికూడా అర్థాంతరన్యాసపూర్వకంగా పలికింది. తెఱవలకు ఎప్పుడు కూడా తేజమే వలపును తెలుపుతుందన్నది.

బలగర్వితుడైన నరకుడికి తేజముసంగతి ప్రస్తావితం కావడంతోటే ఆమాటలు నచ్చాయి. ఇక ఇవి లంజెమాటలు కావు. కాగా అతడు తోడనే ఊర్వశితో 'అవును. ఇది పోలును. సురుల్ని జయించిన నేను యాగభాగాలు పుచ్చుకోకపోతే దేవకాంతలు కవకవ నవ్వుతారు.' అన్నాడు.

ఊర్వశివేసిన ఎత్తు నెగ్గింది. ఆమె చెప్పినదానికి అతడు ఒడబడ్డాడు. ఊర్వశిని వీడ్కొలిపాడు. కొలువుకూటంలో కంబానికి చేరబడి చిత్తరువో, కరువోయనంగ గండారపుబొమ్మవోలె కదలించుకలేక నిలబడివుండిన ఊర్వశి నెమ్మదిగా నిష్క్రమించింది.

నిజరాజధానిఐన మహిష్మతిపురానికి పోయిన మీద 'ఒకనాఁ డూర్వశి మాటపొందు నరకుం డూహించి...' ఇక మనకు అనంతరకథతో ప్రసక్తి లేదు.

ఉన్న ప్రసక్తి అంతా నాచనసోముని పోషణలో ఊర్వశి పాత్ర ఏమైనదని. దానికి సమాధానం నాచనసోముడే చెప్పినాడు. 'అజ్జోటి దిట్ట' అని.

దిట్ట కావుననే అమరేంద్రుని గెలిచిన పోటుబంటును సూటిమాటలతో పందిరివెట్టింది. అతని పతనానికి దోహదక్రియలు చేసింది.

ఉత్తరహరివంశములో ఇరవైఐదు పద్యాలతో ముగింపబడిన ఈ ఊర్వశికథాఘట్టము ఒక రసగుళిక. నాచనసోముడు ఈఘట్టాన్ని దృశ్యకావ్యధోరణిలో నడిపాడు. సంభాషణలు పాత్రగుణపోషణ సమర్థాలై లెస్సగా వున్నాయి.

'పొత్తులదానవు,' 'మిండతెకంబుచేఁత', 'లంజెమాటలు', 'కవకవనవ్వరే', 'సంతలో జవ్వనమ్ముకొన్న' మొదలయిన నుడికారముగల పలుకుబళ్ళతో—'చిల్కవోయినం బంజర మేమిసేయు', 'పువ్వులు వేడుకైనఁ గడివోయిన వేన్ముడువంగ వచ్చునే', 'ఎంత తఱిఁగిన మిరియాలుం జొన్నల సరిపోవే' మొదలయిన సామెతలతో నాచనసోముడు ఈ ఘట్టంలో తనశైలిని మరింత మెఱుగుపరిచాడు.

కంఠస్థ మొనర్చుకోవలసిన ఆంధ్రకావ్య కథాఘట్టాల్లో నాచనసోముని ఈ ఊర్వశి ఉదంతమొకటి.

# జయప్రకాశనారాయణ

## జీవితచరిత్ర

'రోజుకు పదిగంటలు వ్యవసాయపు కూలివాడుగా, ఫ్యాక్టరీలో పాకర్ గా, కర్మాగారంలో మెకానిక్ గా, రెస్టారెంటులో సేవకుడుగా, ఒక కంపెనీ తరపున సరకులు అమ్మే ఏజెంటుగా పనిచేసి పైకం ఆర్జిస్తూ అతడు కష్టపడి అమెరికాలో చదువుకున్నాడు.'

కాంగ్రెస్ సోషలిస్టుకక్ష నాయకుడు జయప్రకాశనారాయణుడు డిటెన్యూగా జెయిల్లోవుండి ప్రమాదకరమైన ఉత్తరాలు వ్రాస్తున్నాడంటూ ఇటీవల ప్రభుత్వమువారు ప్రచారం ప్రారంభించారు.

ఈ ప్రచారంవల్ల ప్రభుత్వంవారు ఆశించిన ఫలితాలు ఒనగూడలేదు సరికదా జయ ప్రకాశ నారాయణుని కీర్తి మరింత విస్తృతమైంది.

### ట్రాము చూడని మేజరు

జయప్రకాశుడు బీహార్ రాష్ట్రంలో బరన్ జిల్లాలోని 'సితాబ్దియర' అనే కుగ్రామంలో కర్షక కుటుంబంలో పుట్టాడు. పందొమ్మిదివళ్లు వచ్చేవరకు– అంటే మేజరు అయ్యేవరకు– అతడు ట్రాము కారుని చూడలేదు.

పందొమ్మిదేళ్లు వచ్చేవరకు పల్లెటూరి గబ్బిలాయిగా వుండిన అతడు ఇప్పుడు భారత కాంగ్రెస్ రాజకీయాల్లో సోషలిస్టు పార్టీకి నాయకమహాశయుడై వెలుగొందుచున్నాడు.

ఇది వింత విషయమే.

జయప్రకాశుని జీవితంలో మరి ఒక వింత విషయంకూడా వుంది.

### వింత దాంపత్యం

అతడు కాంగ్రెస్ సోషలిస్టు. కాంగ్రెస్‌సోషలిస్టుగా అతడు గాంధీజాన్ని తీవ్రంగా విమర్శిస్తాడు. కాని అతనిభార్య ప్రభావతి మొక్కవోని గాంధి భక్తురాలు. ఆమె రాజకీయాల్లో గాంధిని తూచ తప్పకుండా అనుసరిస్తుంది.

ఈ సందర్భంలో ప్రభావతి జయప్రకాశనారాయణుల దాంపత్యాన్ని మహాత్ముడు ఇట్లు ప్రశంసిస్తున్నాడు :

'ప్రభావతికి జయప్రకాశనారాయణుని రాజకీయాభిప్రాయాలు నచ్చవు. తల్లిదండ్రులు ఆమె పదిహేనువళ్ళ బాలికగా వుండగా నా సంరక్షణలో వుంచారు. ఆమెభర్త జయప్రకాశనారాయణుడు అప్పటికింకా అమెరికాలో చదువుకుంటూవుండెను. ప్రభావతి నారాజకీయసిద్ధాంతాలకు హృదయపూర్వకంగా ఒప్పుకోలు ఇచ్చింది. భార్యాభర్తలుగా ప్రభావతి జయప్రకాశులు ఆదర్శప్రాయులు. తన అభిప్రాయాలకు అంకితురాలవు కమ్మని జయప్రకాశనారాయణుడు ఆమెను ఎప్పుడుకాని బలవంతము చేయలేదు. నావద్దకు పోవద్దని కూడా అతడు ఎప్పుడూ ఆమెను చెప్పలేదు.'

జయప్రకాశుని సహనశక్తి అంతటి ఉదారమైనది !

### పార్టీ నిర్మాణము

అతడు 1933 లో నాశిక కారాగారాన్నుండి విడుదలగాంచిన పిమ్మట కాంగ్రెస్ సోషలిస్టు పార్టీని ఏర్పరచాడు. అది నేడు కాంగ్రెస్‌లో ఒక ప్రముఖకక్ష ఐ వుంది.

ఇది జయప్రకాశుని నిర్మాణ శక్తికి మంచి తార్కాణము.

సహాయనిరాకరణోద్యమంలో అతడు ఇచటి కాలేజీ చదువుకు స్వస్తిచెప్పాడు. యూనివర్సిటీవారిచ్చిన స్కాలర్‌షిప్పును తిరస్కరించాడు.

ఆమీద జయప్రకాశునికి అమె

రికాకు పోయి విద్యాభ్యాసంచేద్దామనే అభిలాషకలిగింది.

అమెరికాలో చదువు

అతడు 1922 అక్టోబరులో కాలిఫోర్నియాకు చేరాడు. అచటి విశ్వవిద్యాలయంలో విద్యనేర్చుకోవాలని అతని సంకల్పం. ఐనా మూడుమాసాల పిమ్మటకాని ఆ యూనివర్సిటీలో కొత్తటరము ప్రారంభంకాదని తెలుసుకున్నాడు.

ఈమూడు మాసాలు తీరికగా తిని కూర్చుండగల ధనవంతుడు కాడు అతడు. కాగా ఫలవృక్షాల వ్యవసాయక్షేత్రంలో ఒకదానిలో అతడు పనికి కుదిరాడు.

అప్పుడే అచటి పండ్లఋతువు ముగియబోతూవుంది. జయప్రకాశుడు సూర్యోదయం మొదలు చుక్కపొద్దువరకు పండ్లగంపలమధ్యను నిలిచి పనిచేశేవాడు. మిగల ముగ్గినపళ్ళను, డాగుపడ్డ పళ్ళను ఎత్తివేసి మిగతా పళ్ళను గంపలకు ఎత్తి రవాణాకు సిద్ధంచేయడం అతని పని.

రోజు కూలికి కూలిపని

ఆపనికి సెలవులు లేవు. ఆదివారాలు లేవు. రోజుకు పదిగంటలపని. అయితే ఏమి? మంచికూలి ఇస్తూవుండిరి. రోజుకు పధ్నాలుగు రూపాయిల కూలి !

భారత యువకునికి అది మంచి జీతంకదా! నెలరోజులు పనిచేసి ఖర్చులన్నీపోను అతను మూడు వందల రూపాయిలు ఆదా చేయగలిగాడు.

ఇంతలో పండ్లఋతువు ముగిసింది. అప్పుడు అతడు బెర్కిలేకు వెళ్ళి యూనివర్సిటీ తెరిచేవరకు వేచివున్నాడు. బెర్కిలేలో అతడు ఒకగది అద్దెకు తీసుకున్నాడు. స్వయంపాకం చేసుకుని భోజనం చేసేవాడు.

కాలిఫోర్నియాలో ఒక టరము విద్యాభ్యాసం చేసేసరికి అతనివద్ద వున్న దుడ్డు, దుగ్గాణి అంతా అయిపోయింది.

విద్యాలయం మార్చాడు

అందుచేత అతడు ఐయోవా విశ్వవిద్యాలయానికి వెళ్లాడు. ఆ విశ్వవిద్యాలయంలో జీతాలు కాలిఫోర్నియా విశ్వవిద్యాలయపు జీతాల్లో నాలుగోవంతు మాత్రమే.

అయితేఏమి ? ఈ తక్కువ జీతాన్ని ఇచ్చుకోడానికైనా అతడు తిరిగి వ్యవసాయపు కూలీగా పనిచేయవలసి వుండినది.

ఐయొవానుంచి అతడు విస్కాన్సిన్ విశ్వవిద్యాలయానికి వెళ్ళాడు. అక్కడనే అతనికి సోషలిస్టు సిద్ధాంతాలు అలవడ్డాయి. ఆ విశ్వవిద్యాలయానికి చెందిన ఒక అధ్యాపకుడు గొప్ప సోషలిస్టు ఐవుండెను.

అతని బోధనలు ఆలించి జయప్రకాశుడు సామ్యవాదజన్మదాత ఐన మార్క్సు గ్రంథాలు అవలోకింప దొరకొన్నాడు. ఆగ్రంథాలు అవలోకించిన తరవాత సామ్యవాద సిద్ధాంతాలు జయప్రకాశుని హృదయంలో బాగా పాదుకున్నాయి.

కష్టపడి చదువుకున్నాడు

విస్కాన్సిన్ విశ్వవిద్యాలయాన్నుండి అతడు న్యూయార్కు

కు వెళ్లాడు. అక్కడ అతనికి చాలా జబ్బుచేసింది. అందుచేత అతడు పెక్కుమాసాలు ఆసుపత్రిలోవుండి పోవలసివచ్చింది.

అమెరికాలో అతడు ఎనిమిదేళ్లు గడిపి ఐదు విశ్వవిద్యాలయాల్లో విద్యాభ్యాసం చేశాడు. ఆదిలో అతడు గణిత, పదార్థ, రసాయనశాస్త్రాలు చదివాడు. దరిమిలాను జంతు, మనస్తత్వ, ఆర్థిక, సాంఘికశాస్త్రాలు చదివాడు.

విశ్వవిద్యాలయాల్లో చదువు సాగించుకోడానికిగాను అతడు తరుచు కూలిపని చేసుకోవలసివుంటూ వుండేది.

రోజుకు పదిగంటలు వ్యవసాయపు కూలివాడుగా, ఫ్యాక్టరీలో ప్యాకర్‌గా, కర్మాగారంలో మెకానిక్‌గా, రెస్టారెంటులో సేవకుడుగా, ఒక కంపెనీ తరఫున సరకులు అమ్మే ఏజెంటుగా పనిచేసి పైకం ఆర్జిస్తూ అతడు కష్టపడి చదువుకున్నాడు.

### మాతృదేశానికి రాక

1931 లో అతడు మాతృదేశానికి మరలివచ్చాడు. తోడనే జవహర్‌లాల్ నెహ్రూ కాంగ్రెస్‌కు అనుబంధితమై వుండిన కార్మికశాఖ అజమాయిషీని అతనికి అప్పగించాడు. కొద్దిరోజులకు పిమ్మట శాసనోల్లంఘనోద్యమపు సమయంలో అతడు కాంగ్రెస్‌కు ఆక్టింగు జనరల్ సెక్రటరీ ఐనాడు.

ఆమీద అచిరకాలంలోనే అతడు కాంగ్రెస్‌లో మంచి పలుకుబడిగల ప్రముఖుడైనాడు. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీకి ప్రాణగొడ్డమైనాడు.

### వ్రాతకాడు : ఉపన్యాసకుడు

అతడు కాంగ్రెస్ ప్రముఖుడు, సోషలిస్టుపార్టీ నాయకుడు మాత్రమేకాదు. గొప్ప వ్రాతగాడు. 'సోషలిజమ్ ఎందుకు?' అనే అతని పుస్తకం పలువురి ప్రశంసను అందింది.

అతడు గొప్ప ఉపన్యాసకుడు కాకపోవచ్చు. కాని అతడు చెప్పే మాటలు హృదయపూర్వకమైన విశ్వాసంవల్ల ఉద్గారితమైనవిగా శ్రోతలకు తోచి తీరుతాయి.

అతనిది వర్చస్సుగల వదనం. అతను పొడుగ్గా, సుందరంగా వుంటాడు.

అతనికి రెండే రెండు లోపాలు వున్నాయి.

సామ్యవాద ప్రచారకుడయ్యీ ఎక్కువ ఖరీదుగల తువరపు సామగ్రి కలిగి వుండడమూ—

ఏవిషయంలోకాని కాలనియమాన్ని పాటించకపోవడమూ—

ఈలోపాలు వుండుగాక! భారత భవిష్యత్తువిషయంలో విశేషంగా బాధ్యత వహింపగల కాంగ్రెస్ సామ్యవాదకక్షకు అతడు ఉపాధ్యాయుడై వుండడాన్ని మనం ఒక్క రెప్పపాటుకాలంకూడా మరిచిపోకూడదు.

## విడాకుల వింతలు

నేపాళదేశంలో :

మగనితలగడాక్రింద భార్య వక్కను ఒకదానిని పెడితే విడాకు ఇచ్చినట్లు.

చైనాలో :

భార్య వసపోసినపిట్టలా వాగుతూ వుంటే అది విడాకుకు ఒకకారణం.

మూర్ జాతుల్లో :

భార్య ఇల్లువెడలిపోతూ వుండగా ఆమెమీద రాళ్లు విసిరితే విడాకు ఇచ్చినట్లు.

టర్కోమన్ రిపబ్లిక్‌లో :

భర్త భార్యకు విడాకు ఇవ్వతలస్తే 'ఫో' అంటాడు.

సమోవాలో :

భర్తకు ఒక్క భార్యకు మాత్రమే విడాకుఇచ్చే హక్కువుంది. మిగతా భార్యల్ని వదుల్చుకోవాలంటే వారిని అమ్మివేయాలి.

మూర్ జాతుల్లో :

భార్య కొడుకుని కనకపోతే భర్త విడాకు ఈయవచ్చు.

సింహళంలో :

భర్త భార్యకు 'నీకు విడాకుఇస్తున్నా'నని జాబువ్రాస్తే చాలు విడాకు ఇచ్చినట్లే. ఆజాబు భార్యకు చేరకపోయినా విడాకు పూర్తిఐనట్లే.

ఇండో చీనాలో :

పట్టుబడ్డ ఏనుగు తప్పించుకుపోతే వేటకానిభార్య వ్యభిచరించినట్లు భావింపబడుతుంది. వేటనుంచి వచ్చి వేటకాడు భార్యను విడనాడవచ్చు.

# ముంజేతిమీద మూడోకన్ను

[ వినోదవ్యాసం ]

ఇంద్రుడికి ఒళ్ళంతా కళ్లు—
తేలుకి పదహారు కళ్లు—
శివుడికి మూడోకన్ను వున్నది—
బల్లికికూడా మూడోకన్ను—
పిల్లికంటికి చీకట్లోచూసేశక్తి—
సాలెపురుక్కి పగలొకకన్ను, రాత్రి ఒకకన్ను—
గౌతముడికి పాదంలో కన్ను—
హిరణ్యాక్షుడికి బంగారుకళ్లు—

'సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్' అని సంస్కృతలోకోక్తి ఒకటి వుంది.

## కళ్ళవిషయంలో లోపం

మానవుని అన్ని ఇంద్రియాల్లోకి కన్ను ప్రధానమైంది కావడాన్ని నిరూపించే ఇట్టి సామెతలు కొన్ని తెలుగులోనున్నూ వున్నాయి.

'కన్ను లేకపోతే కలియుగమే లేదు'- 'కన్నో మిన్నో అన్నారు'—ఇత్యాది తెనుగు సామెతలు అందరికీ తెలిసినవే.

ఇంతటి ప్రధానమైన అవయవాల వర్గానికి చెందిన కళ్లు ప్రతిమానవుడికి రెండు వున్నాయి.

అయితే—

ఈ రెండుకళ్లున్నూ ఒకేవైపునవుండి మానవుడికి ఒకవైపుమాత్రమే దృష్టి ప్రసరింపగలిగేవిగా వుంటున్నాయి. వీనికి వెనకచూపు, పక్కచూపు లేకుండా వుంటూవుంది.

మానవుని నేత్రనిర్మాణవిషయంలో ఇది ఒకలోపమే అని చెప్పాలి.

## ఒళ్ళంతా కళ్లు

సమదృష్టి, సమగ్రదృష్టి కావాలంటే మానవుడికి ఒళ్ళంతా కళ్లుకావడం వాంఛనీయం. ఏదేనా వస్తువుని మనం బాగా చూచినప్పుడు మనకున్న రెండుకళ్లూ సరిపోలేదనే భావం వచ్చేటట్లు మనం ఒళ్ళంతా కళ్లుచేసుకు చూశామని అంటూవుంటాము.

అట్లా అనడమల్లా—

మన నేత్రసంపద విషయంలో కొరతగ్గ మార్పుఏదో వుండనే సంగతిని ద్యోతకం చేస్తూవుంది.

ఒళ్ళంతా కళ్లుకావడం కొరతగిందనే భావపరంపరలో దోగాడే మనకు అనూయపడతగ్గవ్యక్తి ఒకడువున్నాడు. అతడు ఎవరనేనా మీప్రశ్న? అతడు మీరు బాగా ఎరిగివున్న ఇంద్రుడు. ఆ ఇంద్రుడు సహస్రాక్షుడు కదా!

సహస్రాక్షశబ్దంవల్ల వేయికన్నులు మాత్రమే సూచితమౌతున్నాయి. కాని అతనికి ఒళ్ళంతా కళ్లే అని (అంటే అవి సహస్రాధికమైకూడా వుండవచ్చునని) పురాణాలు ఉద్ఘోషిస్తున్నాయి.

## మనకుకూడా వేయికళ్లు

ఒళ్ళంతా కళ్లుకావడంలో అనంతకోటి ఉపయోగాలువున్నాయి. ఒళ్ళంతా కళ్లుకలవారికి ముందుచూపు, పక్కచూపు, కిందచూపు, పైచూపు, వెనకచూపు, అచూపు, ఈచూపు ఉంటాయి.

కాబట్టి ఆవేయికళ్ళను సంపాదించడానికి అతడు చేసిన కారుగోష్ఠినికాని- చత్వారంవస్తే ఆకళ్ళ కన్నిటికీ అతడు అద్దాలు ఎట్లాపెట్టుకుంటాడనే విషయాన్నికాని మనం తడవవద్దు.

ఏదోవిధంగా—

మనకుకూడా వేయికళ్ళువస్తే బాగా వుంటుంది.

అయితే—

సృష్ట్యాదినుంచీ మనకు రెండుకళ్ళను మాత్రమే ఇచ్చి కాలంగడిపివేస్తూవున్న భగవంతుడు ఇప్పుడు హఠాత్తుగా ఉదారుడై మనకు ఒళ్లంతా కళ్లను ఇస్తాడని తోచదు.

మొగమోటంలేకుండా మనం వేయికళ్లని ఇమ్మని అడగడంకూడా బాగా ఆశాపాతకమనిపించుకుంటుంది.

కాబట్టి—

మనం మోతాదుగా వుందాం.

## తేలుకి పదహారు కళ్లు

ఇంద్రుడికిలాగ మనకికూడా వేయి

కళ్లు ఇమ్మని అతణ్ణి వేడవద్దు.

ఉన్న రెండుకళ్ళకి కొసరుగా మూడోకన్నుమాత్రం ఇమ్మని ప్రార్థిద్దాము.

ఇది చిన్నకోరికగాని 'ఎంత ఆశ?' అనతగ్గ పెద్దకోరిక కాదు.

మనకంటె అన్నివిధాలా అల్పజంతువు అనతగ్గ తేలుకి తలమీద చేరో పక్కనూ అతడు ఏడెనిమిదికళ్ళ చొప్పున ప్రసాదించివున్నాడు. జంతుశాస్త్రవేత్తని ఎవణ్ణి అడిగినా ఇందలి సత్యాన్ని నిరూపిస్తాడు.

తేలువంటి క్షుద్రజంతువుకి ఇన్ని కళ్లను ఇచ్చిన భగవంతుడు అతనిసృష్టికి శిఖరప్రతిష్ఠ అనదగ్గ మానవజాతికి మరొకకంటిని ఈయడంలో అట్టే లోభగుణం పూనడని తోస్తుంది.

ఇంతకూ—

మూడవకన్ను అనేది భగవంతుని సృష్టిలో అపూర్వవిషయం కాదు.

### శివుడి మూడోకన్ను

తనకు చాలా సన్నిహితుడూ, తనతోబాటు త్రిమూర్తుల్లో ఒకడూ ఐన శివుడికి మూడోకన్ను వుండివుండడం సృష్టికర్తఐన బ్రహ్మకు తెలిసిన విషయమే ఐ వుంటుంది.

అయితే—

మూడోకన్ను కోరడంలో మన ఉద్దేశం దానిని శివుడిలాగ ఇంద్రుడు, మన్మథుడు మున్నగువారిని భస్మంచేయడానికి ఉపయోగించాలని కాదు; త్రిలోచనుల మనే పేరు పొందాలనీ కాదు.

మనకు ప్రస్తుతం వుండుకున్న రెండు కళ్లఏర్పాటుల్లో కొన్ని లోపాలు వున్నాయి. ఆలోపాల్ని తొలగించుకోడానికే మనకు మూడోకన్ను అవసరం.

అంతేకాని దానిని శివుడిలాగ ఇతరుల్ని భస్మంచేయడానికి ఉపయోగిద్దామనే దురుద్దేశం మనకు లేదు.

అయితే—

### బల్లికి కూడా మూడోకన్ను

దేవలోకానికి చెందిన శివుడిమాదిరిగా మానవలోకానికి చెందిన మనం కూడా మూడవకన్నుకోరడం కొంచెం అహంభావాన్ని సూచిస్తుందనే అనుమానం కొందరికి కలగవచ్చు.

అట్టి అనుమానపురుషులికి నేను చెప్పే సమాధానం ఏమిటంటే మూడవకన్నుగల ప్రాణి సాదృశ్యానికి మనం దేవలోకంవరకు పోనక్కరలేదు- మనుష్యలోకంలోకూడా మూడోకన్నుగల ప్రాణులు వున్నాయి.

మనకు శకునాలు చెప్పడంవల్ల కొంతవరకు మన అప్రియత్వాన్ని ఆర్జించుకున్న బల్లికి మూడోకన్నువుంది. ఆకన్ను దానినడినెత్తిని వుండడాన్ని జంతుశాస్త్రవేత్తలు నిరూపించారు.

ఏజంతువుని ముట్టుకున్నంతమాత్రంచేత మనం మైలపడి వెనువెంటనే సచేలస్నానం చేసికాని తోడిమానవుల్ని ముట్టుకోమో అట్టిబల్లికి మూడోకన్ను ఇచ్చి బల్లుల్ని కేవలం క్షుద్రజంతువులుగా చూడగలిగే ప్రజ్ఞావంతులమైన మనకి మూడోకన్ను ఈయకపోవడంలో భగవంతుడు చాలా అన్యాయం చేశాడని చెప్పాలి.

### మనకున్నూ ఉండేదట

అనుభవజ్ఞులైన పెద్దలు మనకు అది

లో భగవంతుడు రెండుకళ్లమధ్యని నుదుటిమీద మూడోకన్ను ఇచ్చివున్నాడనీ, కొంతకాలానికి భగవంతుడు ఎందుచేతనో వెనుక ఇచ్చివున్న మూడోకంటిని లాగివేసుకున్నాడనీ, అక్కడ ఒకప్పుడు ఒక కన్ను వుండివుండడానికి గురుతుగా బొట్టుపెట్టుకునే ఆచారం ఏర్పడిందనీ చెబుతారు.

ఇందులో—

ఎంత సత్యముందోమాత్రం నేను చెప్పలేను.

మూడోకన్ను ఇచ్చి తిరిగి పుచ్చుకోవడమే నిజమైతేమాత్రం మనకు భగవంతుడిమీద తప్పకుండా కోపం వచ్చి తీరుతుంది.

మనకు ఈయకండా బల్లికి మూడోకన్ను ఇచ్చాడన్న సంగతి తెలుసుకునే అతని అన్యాయాన్ని ఆడిపోస్తూవున్నప్పట్లో అతను ఒకనాడు మనకు మూడోకన్ను ఇచ్చివుండి దరిమిలాను మళ్ళీ తీసేసుకున్నాడనికూడా తెలిస్తే మనకు మనస్సులో ఎంతకష్టంగా వుంటుందో వూహించడానికి వీలులేదు.

## మూడోకన్ను అవసరం

అసలే ఇవ్వకపోతేనేమి, ఇచ్చిమళ్లీ పుచ్చుకుంటేనేమి భగవంతుడు ఇప్పట్లో మనకు మూడోకన్ను లేకుండాచేశాడు.

ఇది సహించతగ్గ విషయంకాదు. మూడవకన్ను సంపాదించడానికి మనం విశేష ప్రయత్నం చేయాలి, భగవంతుణ్ణి అర్థించో, ప్రార్థించో మూడోకన్ను పొందడం అవసరం.

అయితే—

మూడోకన్ను ప్రసాదితమయ్యే పక్షంలో అది మునపటిలాగ రెండుకళ్లమధ్యని నుదుటిమీద వుండడం మంచిదికాదు.

ఏమంటే—

మనకు ఇప్పట్లోవున్న రెండు నేత్రాలూ అవి ఏ ఆననానికైతే అలంకారప్రాయంగా వుంటూవున్నవో ఆ ఆననాన్నే అవి చూడలేనిస్థితిలో వున్నాయి. తామువుండేతావునే చూడలేని కళ్లలోకొన్నంతా చూడగలిగితేమాత్రం ఏమిప్రయోజనం? ఆత్మజ్ఞానంలేని అద్వైతవిజ్ఞానివలె మన ప్రస్తుత నేత్రాలస్థితి

# దాంపత్యంలోని దాష్టీకాలు

విధవరాల్ని పెళ్లాడ్డంలో నేను చాలా తప్పచేశాను. ఈయీపరిస్థితుల్లో నాపూర్వపుభర్త ఐతే ఈయీవిధంగా చేసివుండేవాడు అంటూ ఆమె నన్ను విసిగిస్తూవుంది. మారుమనువుదాన్ని కట్టుకుంటే మొదటి మొగుడి వూసుల్తో తెల్లార్చిందనేసామెత నాపట్ల నిజమైంది.

*       *       *

నాకంటె తాను వంటబాగా చేస్తాననే నాభర్త డబాయింపు నాకు సంతోషాన్నే కలిగిస్తుంది. తన డబాయింపు నిర్వహించుకునే అడాపుడిలో ఆయనవుంటే నేను మరోగంటసేపు పట్టెమంచంమీద పడుకుంటాను.

*       *       *

నాభార్యకు బాగా వినిపించదు. మా పెంపుడుకుక్క ను కట్టిన స్తంభందగ్గిర నిలబడి నేను మా స్కోముట్టడివార్త పత్రికలో పైకి చదువుతూవున్నాను. కుక్కను ఆమెమీదకు ఇస్కా అన్నానని ఆమె కోపగించింది.

*       *       *

బయటనుంచి వచ్చిన నాభర్త లాల్చీ భుజంమీద కుంకంబొట్టు అంటుకునివుండగా ఇదేమని నేను వేసిన ప్రశ్నకు ఆయన ఇట్లా అన్నాడు: నడుస్తూవున్న బస్సుని డ్రయివరు హఠాత్తుగా బ్రేక్ వేసి ఆపిన కుదుపులో 'బస్సులో నా పక్కని కూర్చున్న పదహారేళ్ళ పసుచుపిల్ల నావీపుమీద తన కరపల్లవాన్ని, నాబుజంమీద తన వదన చంద్రబింబాన్ని మోపితే అది నాతప్పకాదు.'

*       *       *

తాను నన్ను సినీమాలకు తీసుకువెళ్ళనప్పుడు నేను రాత్రిళ్లు ఇంట్లో ఒంటరిగా వుండలేక పక్కింటి విద్యార్థి బ్రహ్మచారిని తీసుకుని తారాశశాంకంటాకీ చూడడానికి బండిమీద వెళితే నా భర్త చికాకుపడకూడదు.

*       *       *

హిట్లర్ని చూడ్డం తటస్థిస్తే నేను అతనితో ఇల్లాచెయ్యి, అల్లాచెయ్యి అని చెబుతానని నాభర్త తరుచు కోతలుకోస్తూవుంటాడు. కాని మాపక్కయింటివారితో మనతోటలో వారి డాబామీదనుంచి తుక్కువేయవద్దని చెప్పండంటేమాత్రం ఓరుగాలిలో దీపంలాగున వణికిపోతాడు.

శోచనీయమైవుంది. ఇక అదేస్థితిలో మరి ఒక నేత్రంకూడా ఏర్పడడంవల్ల ఏమి ప్రయోజనం వుంటుంది?

కాబట్టి—

మనకు ప్రసాదితంకాబోయే మూడో కన్ను మన ముఖాన్ని చూడగలిగేస్థానంలో వుండాలి.

## వెన్ను చూడలేని కన్ను

ఇంకో సంగతి.

ఇప్పటి ఏర్పాటులో మననేత్రాలు తామువుండేతావుని తాము చూసుకోలేనిస్థితిలో వుండడమేకాదు, తమ యజమానియొక్క వెన్నుని—ఒక వెన్నునే అనడం దేనికి? వెనుకభాగాన్నంతటినీ కూడా—చూడలేని స్థితిలో వున్నాయి.

ఈస్థితిలో వుండడంవల్ల ఇప్పటి నేత్రాలకు వెనకచూపు లేకుండావుంది. మదరాసువంటి మహానగరాల్లో రోడ్ల మీద నడిచేవారికి వెనకచూపు లేక పోవడంవలని ప్రమాదాలు వేరే వివరించ నక్కరలేదు.

ఇందువల్ల—

కలగబోయే మనకంటికి వెనకచూపు కూడా వుండవలసిన అవశ్యకత అవగతమవుతూవుంది.

## మూడోకన్ను యోగ్యతలు

కాగా—

మనం సంపాదించబోయే మూడో కన్నుకు ముఖ్యంగా రెండు యోగ్యతలు వుండాలని తేలుతూవుంది.

ఆ రెండు యోగ్యతలూ ఏమిటంటే?

ఒకటి:

మనముఖాన్ని చూడగలిగే స్థానంలో వుండడం—

రెండు:

వెనకాలనడిచే సంగతులు చూడగలిగేస్థితిలో వుండడం.

సంపాదించబోయే మూడోకంటికి ఈరెండు యోగ్యతలు ఏకకాలంలో వుండాలంటే ఆకన్ను మన ఎడమముంజేతికి—ఇప్పుడు మనలో మాన్యులు రిస్టువాచికట్టుకునేచోట—వుంటే బాగుంటుందని తోస్తుంది.

ఇట్లా ముంజేతికి మూడోకన్ను వుండడంవల్ల కలిగే లాభాలు పరశ్శతాలు. మచ్చుకి కొన్నిమాత్రం చెబుతాను.

## ముంజేతిమీద మూడోకన్ను

మొగం చూచుకోడానికి అద్దాన్ని ఆశ్రయించ నక్కరలేదు. ఎడమముంజేతికంటితో మొగాన్ని చూస్తూ కుడిచేత్తో బొట్టుపెట్టుకోవచ్చు.

గోడ అవతల ఏమిజరుగుతూవుందో తెలుసుకోడానికి కుర్చీ, పీట వేసుకుని ఎక్కి నిక్కి చూడనక్కరలేదు. చెయ్యి ఎత్తి అవైపుకు తిప్పితే చాలు.

రోడ్డువెంట వెళ్లేటప్పుడు ఎడమ ముంజేయి వెనకవేపున నడ్డిమీద అడ్డంగా జేర్చి వుంచితే వెనకనడిచేసంగతు లన్నీకూడా తెలుస్తాయి.

ఓతాయిలారి నెత్తిమీద గోరింకఅని

# జ్ఞానము : జ్ఞానవృద్ధుల పలుకులు

జ్ఞానాన్ని అనుభవంలో ఉపయోగించడమే జ్ఞానానికి నిగ్గు తేల్చడం.

—*Confucius*

జ్ఞానం ధనపేటిక. అనుభవం అనేది ఆధనపేటికకు తాళముచెవి.

—*Old proverb*

నాకు తెలియని విషయాన్ని గురించి భోగట్టాచేసి తెలుసుకోడానికి నేను ఎప్పుడుకాని సిగ్గుపడలేదు. అందుచేత నేను విశేషజ్ఞానాన్ని సముపార్జించుకో కలిగాను.

—*Persian philosopher*

ఇతరులకు మనజ్ఞానాన్ని బోధించడమంటా మనకాంతి కోలుపోకండా మనదీపంతో ఇతరుల దీపాన్ని వెలిగించుకోనివ్వడమే.

—*Jane porter*

ఇదివరకు ప్రపంచంలో జరిగిన విషయాలు ఎంత ఎక్కువగా తెలిస్తే మనిషికి చేయవలసినపనిని గురించి అంత సూక్ష్మంగా తెలుస్తుంది.

—*Disraeli*

విశేషజ్ఞానవంతుడు కానివాడు విశేషంగా అనుమానపూరితుడై వుంటాడు.

—*Bacon*

జ్ఞానార్జనం ఎక్కువ అవుతూ వున్నకొద్దీ ఒక పురుషుడు ఎక్కువ వినయవినమితుడు అవుతూ వుంటాడు.

—*Fielding*

నాకంటె ఎక్కువజ్ఞానం గల వారినిగురించి నేను ఎప్పుడుకాని అసూయపడను. నాకంటె తక్కువ తెలిసినవారిని గురించిమాత్రం జాలిపడతాను.

—*Sir Thomas Browne*

వరస ఐనవారు వేళాకోళం చేయడానికి వీలుండదు. నెత్తిమీద ఏంలేదన్న సంగతి తడుముకోకుండానే చెయ్యెత్తి ముంజేతి కంటితో తెలుసుకోవచ్చు.

స్త్రీలు సిగలో పువ్వులు పెట్టుకుని 'బాగా అమరాయో, లేవో-చూడవో, ఓ విడా!' అని ఇతరుల్ని ఆశ్రయించనక్కర లేదు. తమ ముంజేతికంటితో ఆపరీక్ష సాగించుకోవచ్చు.

తలదువ్వి లోపల ఏమిజరుగుతూ వుందో చూడ్డానికి వీలులేని ఇరుకు స్థలాల్లో ఈ కంటిచేతిని దూర్చి సంగతి సందర్భాలు కనుక్కోవచ్చు.

వెనకపాటునవచ్చి కళ్లుమూసే పరియాచకాలు సాగవు. ముంజేతికన్ను కళ్లుమూసినవారిని కనుగొంటుంది.

ఇంకా విస్తరించడం అనవసరం.

### కాలిమీద కన్ను

ఇంతకూ—

మూడోకన్ను ముంజేతికన్ను ఐతే బాగుంటుందనే నాకోరిక గొంతెమ్మ కోరిక కాదు. ఇట్టి కోరికలు ఈవరకు నెరవేర్చుకున్నవారు వున్నారు.

గౌతముడు అనే మునిపుంగవుడు న్యాయసూత్రాలు రచించాడు. వ్యాసుడికి అవి నచ్చాయికావు. అందుచేత వ్యాసుడు ఆసూత్రాల్ని దూషించాడు. తన సూత్రాల్ని దూషించిన వ్యాసుణ్ణి అననాలంకరణాలయిన నేత్రాలతో చూడనని ప్రతిజ్ఞ చేసి గౌతముడు పాదమందు నేత్రాన్ని కల్పించుకుని వానిని చూచాడు. అప్పటినుంచి గౌతముడికి అక్షచరణుడు, అక్షపాదుడు అనేపేర్లు వచ్చాయి.

అడవుల్లోవుండి ఆకు అలాలు తినే గౌతముడు అక్షచరణుడు ఐనప్పుడు— జనపదాల్లోవుండి అన్నిరుచులూ తినే మనం వామకరబంధాక్షులం కావాలని కోరడంలో అసంభావ్యం ఏమీవుండదనుకుంటాను.

### ఒక కంటికి పిల్లి కంటి శక్తి

ఈనిర్ణయానికి వచ్చినతరవాత ఈ వ్యాసాన్ని ఒకమిత్రుడికి చదివి వినిపించాను. అతడు నా ఆలోచనకు ఆనందించి, నాసూచనకు సంతోషించాడు. మనకు మూడోకన్ను వుండితీరాలనీ, వుండబోయే ఆమూడోకన్ను ఎడమముంజేతికే వుండడం సర్వవిధాలా బాగుంటుందనీ అన్నాడు.

ఈసందర్భంలో తనదికూడా ఒక సూచనవుందన్నాడు. అది ఏమిటని అడిగాను. అందుమీద అతడు ఇట్లా చెప్పాడు.

'మూడోకన్నుకోసం భగవంతుణ్ణి ఎట్లాగా అడగబోతున్నాము. అదే సందులో ఇంకో చిన్న కోరికకూడా కోరదాము. మన ముఖంమీది రెండుకళ్ళూ చీకట్లో కనిపించవు. కాబట్టి అందులో ఒకకంటికి చీకట్లోచూచే పిల్లికంటిశక్తిని ఇమ్మని అడుగుదాము.'

### బంగారు కళ్లు

నేత్రాలవిషయంలో ఇది కోరతగ్గ మరియొక స్వల్ప సంస్కరణమే. అవశ్యం అర్థించతగ్గదే. ఇది ఎంతమాత్రమూ హిరణ్యాక్షువరాల్లో చేరదు. హిరణ్యాక్షుడనగా బంగారుకళ్ళవాడని అర్థం. మనం ఆశాపాతకులమై హిరణ్యాక్షాలు (బంగారుకళ్లు) కోరడంలేదు.

ఒక కంటికిమాత్రం పిల్లికంటిశక్తి ఇమ్మన్నాము. ఈ చిన్నికోరికను మన్నించడానికికూడా భగవంతుడికి అట్టే అభ్యంతరం వుండకూడదు.

ఏమంటే—

కొన్నిజాతుల సాలెపురుగులకు పగలు ఉపయోగించుకునేటందుకు కొన్ని కళ్లు, రాత్రిళ్లు ఉపయోగించుకునేటందుకు కొన్నికళ్లు భగవంతుడు ఇచ్చివున్నాడు.

సాలెపురుక్కి ఇచ్చిన పాటైనా మనకు భగవంతుడు ఈయకుండా వుంటాడా ?

మనకు—

మూడవకన్ను రావడమూ, మొగంమీది కన్నుల్లో ఒకదానికి పిల్లికంటిశక్తి కలగడమూ జరిగితే ఇక నేత్రాలవిషయంలో కోరతగింది ఏమీవుండదు. మనకు ముందుచూపు, వెనకచూపు, చీకటిలో చూపు కూడా కలుగుతాయి. మూడు చూపులూ కుదిరినమీదట మనం ముల్లోకాల్ని జయించవచ్చు.



# మణిమాల



## రాజమండ్రిలో రేడియోస్టేషన్

ఆంధ్రులకు ప్రత్యేకం రేడియో స్టేషనువుండవలసిన అవసరం ఎవరుకాని కాదనరు.

తిరుచునాపల్లిలో అరవవారికి ప్రత్యేకం రేడియోస్టేషను కట్టినారంటే, ఆస్టేషను ఏర్పరచుటకుముందు, తిరుచునాపల్లి మ్యునిసిపల్ లిమిట్సులో 1000 రేడియోసెట్లు వుండివున్నసంగతి ఆంధ్రులు మరువరాదు.

బెజవాడ మునిసిపాలిటీ తన ఆవరణలో 1000 రేడియోసెట్లు సంపాదించగలిగినట్లయితే ఇక్కడ ప్రత్యేకం రేడియోస్టేషను దానంతట అది ఊడిపడుతుంది.

ఆంధ్రులకు ప్రత్యేకం రేడియోస్టేషను కావాలనేవిషయం రేడియోఅధికారవర్గమువారు ఆలోచించివున్నారు. ఇందువిషయమై రేడియో కంట్రోలరు, ఇంజనీరు ఆంధ్రదేశ సంచారముచేసి జనసంకీర్ణాన్నిబట్టి రాజమండ్రి రేడియోస్టేషనుకు వీలుగావున్నదనిన్నీ, అక్కడనుంచి మీడియమ్ వేవ్ ద్వారా చుట్టూ ఎనభైమైళ్ళదూరంవరకు వ్యాపిస్తూ సామాన్యజనులకు సైతమూ అందుబాటులో వుండే సెట్లను కొని పంచుటకు అవకాశంవుండుననీ నిశ్చయించారు.

—కపిల కాశీపతి.

(బెజవాడ ఉపన్యాసంలో.)

## గుత్తికొండలో ఇనపగనులు

గుత్తికొండ గుంటూరుజిల్లాలోని గ్రామం. మచిలీపట్టణం మార్మగోవా రైలుబాటమీదవున్న నరసారావుపేటకు ఇరవైమైళ్ళ దూరంలోనూ, గుంటూరు మాచర్ల రైలుబాటమీదవున్న పిడుగురాళ్లకు ఐదుమైళ్లదూరంలోనూ వున్నది.

గుత్తికొండబిలం చరిత్ర ప్రసిద్ధమైంది. అంతేకాదు అక్కడ ఇనపగనులుకూడా వున్నాయి. అరవై, డెబ్భయి ఏళ్ళక్రితంవరకు అక్కడ ఇనపపని సాగుతూ వుండేది. వ్యవసాయపు పనిముట్లు, కత్తులు మొదలయినవి చేస్తూవుండేవారు. ఆనాటి కొలుముల ఆనమాళ్లు, కొలుముల బూడిద ఇప్పటికికూడా అక్కడ కనిపిస్తూ వుంటాయి.

గుత్తికొండ దక్షిణభాగానికి కొలుములపాలెమనే పేరుకూడావుంది.

విదేశీసరుకు దిగుమతి మూలకంగా ఇక్కడి ఇనపపరిశ్రమ నాశనమైంది. ఆనాటి ఇనపపనివాళ్లు ఇప్పటికికూడా కొంతమంది అక్కడ నివశిస్తున్నారు. కాని వారు జీవనోపాధికోసం ఇతర వృత్తులు అవలంబిస్తున్నారు.

కొత్తపద్ధతులమీద ఇనపసామగ్రి తయారీకి ఈప్రదేశం అనువైవుంది. ప్రయివేటు కంపెనీలుకాని, ప్రభుత్వంవారుకాని ఈ పరిశ్రమను పునరుద్ధరించడం అవసరం.

ఈగ్రామంచెంత కర్రకాల్చిన బొగ్గు దొరుకుతుంది. ఈపరిశ్రమకు ఆబొగ్గు పనికిరాకపోతే దగ్గరలోవున్న నైజాము రాజ్యంలోని సింగరేణి గనులనుంచి రాక్షసిబొగ్గు తెప్పించుకోవచ్చు.

—ఎ. వాసుదేవరావు

(హిందూపత్రికలో)

## బీర్‌బల్ తెనుగువాడు

అక్బరుచక్రవర్తి ఆస్థానములో నౌరతన్ (నవరత్న) అను తొమ్మిదిమంది కవులు, పండితులు ఉండిరి. విక్రమార్కుని నవరత్నముల అనుకరణముగా వీరిని అక్బరు ఏర్పాటుచేసెను. అందు బీర్‌బల్ (వీరబల) అను పేరుగలవాడు ఒకడు. ఇతడు ఆంధ్రుడు 'వీరబల' వినోదములుఅని తెలుగులో ఒక గ్రంథముంది. బీరబలుడు హాస్యములో ఆరితేరినవాడు. మన తెనాలిరామలింగని వంటివాడు అందుచేత అక్బరుకు అతనంటే చాలా ప్రేమ బీరబలుడు. క్రీ.శ. ౧౫౪౧ లో గోదావరిజిల్లాలోని ఒక గ్రామములో ఒక ఆంధ్రబ్రాహ్మణకుటుంబములో జన్మించెను. అతడు ఢిల్లికివెళ్ళి ఆస్థానములో చక్రవర్తిని మెప్పించి అతని విశ్వాసపాత్రుడగు మిత్రుడయ్యెను. అక్బరు అతనికి 'రాజా', 'కవిరాయ' అను బిరుదాలిచ్చెను. బీరబలుడే అక్బరుకు సూర్యనమస్కారాలు నేర్పించెను. అక్బరు కొత్తగా స్థాపించిన 'దీన్ ఇలాహీ' అను మతమును బీరబలుడు అంగీకరించెను. క్రీ. శ. ౧౫౮౬ లో అతడు సైన్యాధిపతియై సరిహద్దుసూబాలో యూసుఫ్‌జై అను పఠానువీరునితో అక్బరు ఆజ్ఞచే యుద్ధముచేసి అందే చని

పోయెను. అక్బరు చాలా కాలమువరకు అతనిమృతికై విలపించెను. (హిందూ ౨౮ ఆగస్టు ౧౯౪౧ నాటి పత్రికనుండి.)

—గోలకొండ.

---

## భారతదేశంలో వైద్యవిద్య

ప్రాచీన సంస్కృత, పాళీ గ్రంథాలలో పెక్కురోగాల్నిగురించి, వాని చికిత్సలనుగురించి వివరాలు వున్నాయి.

క్రీస్తుపూర్వము 750 ప్రాంతంలో రచితమైన పాణిని వ్యాకరణంలో వాత, పిత్త, శ్లేష్మ ప్రస్తావన; గ్రహణి, కామెల, మధుమేహం, క్షయ, హృద్రోగమున్నగు రోగాల ప్రస్తావనవుంది.

క్రీస్తుపూర్వం నాలుగోశతాబ్దిలో వుండిన కౌటిల్యుడు వైద్యవృత్తి ప్రభువుల అజమాయిషీలో వుండడాన్ని తెలుపుతున్నాడు. ఆనాడు ప్రమాదరోగాల్ని గురించి వైద్యుడు అధికారులకు తెలియజేయకపోతే శిక్షితుడు అవుతూవుండెను.

బౌద్ధుల మతగ్రంథాలుకూడా మాలికలు, తైలాలు మున్నగు ఔషధాలను గురించి వివరిస్తూవున్నాయి. ఆగ్రంథాలలో శస్త్రచికిత్స, వాటిసంబంధమైన కట్లు మున్నగువాని ప్రస్తావనకూడా వుంది.

బింబిసారుని వైద్యుడు జీవకుడు వైద్యంనిమిత్తం కాశి, శ్రావస్తి, ఉజ్జయిని మున్నగు స్థలాలకికూడా వెళుతూ వుండినట్లు వుంది. అతడు గొప్ప శస్త్రచికిత్సకుడు. మెదడు, కడుపు, బీజాలు కూడా శస్త్రచికిత్సచేసి అతడు రోగాల్ని నయంచేస్తూ వుండినాడు. అతడు బుద్ధునికికూడా చికిత్సచేశాడు. కొత్త ఔషధాలెన్నో అతడు కనుగొన్నాడు.

తక్షశిల విశ్వవిద్యాలయంలో వైద్యవిద్య ఏడేళ్లు అభ్యసింపవలసి వుండెను. అప్పుడుకాని ప్రాక్టీసుచేయడానికి డాక్టరుకి అనుమతి లేకుండెను.

దక్షిణ హిందూదేశంలోని కొన్ని శాసనాలు విద్యాశాలలకు అనుబంధితాలయివుంటే ఆసుపత్రులనుగురించి ప్రస్తావిస్తూవున్నాయి.

ప్రాచీనకాలంలో భారతదేశంలో వైద్యవిద్య నిర్బంధమై వుండెను.

—రాధాకుముద్ ముఖర్జీ

---

## ఇంటిముందే పశువులశాల

దోమల పిండోత్పత్తికి పశురక్తం పీలుస్తాయట. రక్తం వాటికి ఆధారంగా అక్కర్లే అవుసరం లేదట. మానవరక్తమైనా పశురక్తమైనా వాటికి బాధలేదట. అందుచేత మొట్టమొదట కనిపించినవాటి రక్తమే పీలుస్తాయట. రక్తం పీల్చడానికి దోమలకు తొండమొకటుంటుంది. అది సున్నితంగా వుంటుంది. పశువుల చర్మం కన్నంపెట్టి రక్తం పీల్చడానికి మొదట పనికిరాదు. అందుకుగాను కొంత అలవాటు పడాలి. పిదప ఆ తొండము మోటుదేరి పశుచర్మాన్ని గాయపెట్టగలదు.

ఈ కిటుకు తెలుసుకున్నారు పాశ్చాత్యులు. ఇందులో హాలెండువారు అగ్రసరుల. వారి దంతా బురదదేశము కాబట్టి ఏదేనా గృహనిర్మాణం చేసేముందు గాలి యెటునుంచి వీస్తుందో చూచి అటువేపు పశువులశాల కట్టి దానికి కొంత దూరంలో యిల్లు కట్టుకుంటున్నారు. అందువల్ల దోమలబాధ నిశ్చయంగా తగ్గుతుందని వారురాశారు.

మన పల్లెటూళ్ళలో పశువులశాల యింటిముందు కనిపిస్తే ఏవగించుకుంటారు పట్టణవాస్తవ్యులు.

(ప్రజామిత్రలో)

—ని. లింగమూర్తి.

---

# ఆదరింపంగ రావమ్మ: ఆంధ్రమాత!

సీ. బాలకేసరివోలె బాలచంద్రుడు వీరవరుడు సంగరమున నుఱుకునాటి
కాకతీయులు వీరఖడ్గకాంతులజిమ్మి అరివర్గములను నురుమాడునాటి
మానరక్షణకునై మల్లమాంబాదేవి నిశితఖడ్గము చేత నిల్పునాటి
ఆంధ్రభోజుండు మున్నాంధ్రపౌరుషవిక్రమాగ్నిచే బరులను నణచునాటి

గీ. ఆంధ్రకీర్తిని విజయ సింహాసనమున
ప్రభ్విగా జేసి సౌఖ్యంబు బడయునాటి
సాహసోత్సాహములు మది సందడింప
నాదరింపంగ రావమ్మ ఆంధ్రమాత!

—గుత్తి లోకనాథ సుబ్రహ్మణ్యం.

[వీనిని సేకరించినది దేవగుప్తాపు వెంకటరమణమూర్తి పంతులు గారు. వీనిని వరి ఊడ్పులలో విశాఖపట్టణం మండలంలోని స్త్రీలు పాడుతారు. 'నోమినోమల్లార నోమన్నలారా చందమామ' అను పల్లవి ప్రతి చరణము తుదిని పాడుతుండాలి. —సంపాదకుడు.]

# పల్లెపదాలు

పట్టెమంచము వేసి పరుపమర వేసీ
పరుపుపై పందుమ్మా మల్లెలేబోసీ
మల్లెలెత్తాకుండా ఒళ్ళలోబోసీ
ఒళ్లువెత్తాకుండా ఓడంబరాలూ
గంధములు అక్షతలూఆపరుపుపైనీ
పువ్వులేపుష్పములు ఆపరుపుపై నీ
సాలూరు సన్నాలూ ఆపరుపుపైనీ
నాల్గుకోళ్ళను నాల్గు దివనాటకములూ
హద్దుమధ్యారేయినిద్దురా ప్రొద్దూ
కలియుగంధారంబూ కానరానేళా
అంతలో కాముడూ చేరిపాన్పెక్కీ
కాంతతో కాముడూ కథలు పాడిచేడూ
యీకథల నీవైనా చెప్పినట్లయితే
నేనెక్కు నంబారీ నీకిచ్చుతానూ
నేనేలు రాజ్యంబూ నీకిచ్చుతానూ
నేనెక్కు గుర్రములూ నీకిచ్చుతానూ
నేనెక్కు పాలకిలు నీకిచ్చుతానూ
దానిమీద ముత్యాలూ వన్నె రత్నాలూ
పువ్వులే పున్నంపూచంద్రుడునుబోలూ
కాయలే కవ్వంపు వృక్షంబుబోలూ
ఆకులే జవ్వాదీ వాసనలుబోలూ
ఆకథా తెలియకా అలిగెళ్ళిపోయి
అరుగుమీద వారన్న అక్షరాలేశి
వంటింట్లోవారమ్మ వండుతున్నాదీ
ఏనుగులు మాయింట వెయిలక్షలున్నా
ఎండతోనొచ్చే వేఏకాంతముగనూ
పాలకిలు మాయింటా పదివేలు వున్నా
పరుగెత్తివచ్చే వే పణతిరో నీవూ
గుర్రాలు మాయింటా గుదిలాడుతున్నా
ఎండతో వచ్చేవే ఏకాంతముగనూ
వంటలో వారమ్మా వాకళ్ళకొచ్చి
పాన్పెక్కి కాముడూ కథలు పాడిచేడూ
ఆకథా చెప్పలేకా అలిగి వచ్చిందీ
ఏమికథ పాడిచేడే వెర్రిచెల్లేలా
దాని మొదలు ముత్యాలూ వన్నె రత్నాలూ
దానికాయ కవ్వంపూ వృక్షంబుబోలూ
దానియాకు జవ్వాదీ వాసనలుబోలూ
ముగ్గురన్నలతోడా నీవు పుట్టలేదా
మూడుమాటలురావా వెర్రి చెల్లేలా
నలుగురన్నలతోడా నీవుపుట్టలేదా
నాలుగుమాటలురావా వెర్రి చెల్లేలా
అయిదుగురన్నలతోడా నీవు పుట్టలేదా
ఏడ్గురన్నలతోడా నీవు పుట్టలేదా
ఏడుమాటలు రావా వెర్రిచెల్లేలా
పదుగురన్నలతోడా నీవు పుట్టలేదా
పత్తికాయన్నమాటా నీవు చెప్పలేదా
సాలివానిసరిత్రాడూ ఆచెట్టుక్రిందా
మగవాడి మొలత్రాడు ఆచెట్టుక్రిందా
ఆడవారిబట్టలూ ఆచెట్టుక్రిందా
ఆమాట విన్నాదీ అతిమోదమందీ
నోమినోమల్లారా నోమన్నలారా

—••••••—

## కోలాటపదాలు

[గతసంచిక తరువాయి]

౫

చీరలు లేవుగదే (యిక)
మన సిగ్గులు బోయెగదే
నేరము లే విభు నేరము లెంచకా
కోరివిధించిన కోమలితోడను,
తొంగిచూడరమ్మ (కృష్ణుని)
త్రోవలు గనరమ్మా
వంగివంగి వాడొచ్చినవిధమున
రంగునాట్యములాడెను స్వామిని,
చీరలు ఏమాయే (మన)
సంచారము లేమాయే
కోరిక కోరిక నోముఫలంబు

దూరము మన కాయెనే ఓ అమ్మా,
చీరలు విడుచుచును (యమునా)
తీరమునందుననూ
చోరులురారని దూరముజూడక
నేరకబోతినె ఓ అమ్మా,
యెక్కడివాడమ్మా (చీరల)
కెక్కడి దొంగమ్మా
చక్కనిపనిగా దక్కరో వినవే
మ్రొక్కెదనోయమ్మా,
మోసపోతిమమ్మా (చీరల)
జాడలు లేవమ్మా
చూచితిమన్నా వారికి దోసెడు
కాసులిస్తు నమ్మా,
తొగరు పువ్వుచీరే (నాది)
మొగలిపువ్వు రవికే
పెండ్లినాడు నా పెనిమిటిదెచ్చిన
ఎఱ్ఱపట్టుచీరే,
తరుణిరో యిటుజూడుమా (వాని)
యడుగుదామరలును
పొన్నపొగడలు పూలతోటలో
మగవారెవ్వరె ఓయమ్మ,

౭

మల్లెపందిరదిగో (సుందరీ)
మాధవు డల్లడుగో
మొల్లసుగంధులు మొనసిగొల్వగా
కల్లగాదు ఓపల్లవపాణిరో,
అంగనలను బిలచీ (చెంగుల)
చేర మతము జేసీ
అబ్బురముగ బిగి గుబ్బలుబ్బుచును
మబ్బుదీరి నా మదనకటారిరో,
చందనతరువులను (మదన)
శేషతల్పములనూ
చందన స్తంభము లందుటతోడనే
పొందుగానుమకరందముబొల్చెటి,
మకరతోరణములూ (మొగలి)
విరుల కర్ణములూ
రారకృష్ణయని రమణులు బిల్వగ
పోరకృష్ణయని పొలతులుగొల్వగ,
చేయిచేయి గలసీ (మరియొక)
చేతులు పైకెత్తీ
హరిగోవిందుని అడుగులు వేయుచు
భజగోవిందుని పదములుగొల్చుచు,
చెలియ రతులుగలసీ (మరియొక)
చెలి రమ్మనిబిలచీ
చెలియలమోముల శౌరిబాలుడట
అలయ మొసగిన రంగధాముడట,

## కొన్ని సామెతలు

ఉడుముకేలరా ఊళ్లో వార్తలు.

దొబ్బులు గుర్రానివి, అనుభవం రాజుగారిది.

సంత మెరుగు, సాని మెరుగు,

కోతిముఖమైనా రాత బాగుండాలి.

ఆరంలోనూ బేరంలోనూ ఖరాఖండీ వుండాలి.

వరసకు తమ్ముడు, వావికి బావ.

అల్లు కొత్తవి అయితే తిరగల్లు కొత్తవా ?

ఆశ ఆలిమీద, ఆధారం చాపమీద.

పనివాళ్లు పందిరి వేస్తే పిచికలు పడదోసాయట.

అశ్రద్ధపితాళ్ళకు ఆకతాయి శ్రాద్ధము.

కుడితే తేలు, కుట్టకపోతే కమ్మరపురుగు.

ఇంట్లో ఈగలమోత, బయట సవారీలమోత.

ఆచారానికి అంతమూ, అనాచారానికీ ఆదీ లేదు.

దుంగనక దుత్రనక తిన్నదిరా కడుపు.

పలువురు మెచ్చింది పాట, పది చెట్లున్నది తోట.

జగడమెట్లా వస్తుంది దాసరయ్యా అంటే బిచ్చమెట్టు చచ్చుముండా అన్నాడట.

ఇంతోటి చక్కటి మొగుడికి నేను సమర్తాడుతానా అన్నదట.

ఉపాదానమన్నా అంటే మా వారు అందుకే వెళ్లారన్నదట.

ఏకాదశి బ్రాహ్మడా అంటే కాలేకోతివిఎసందొయ్యమన్నాట్ట.

అద్దింటికి గృహప్రవేశం: రంకు మొగుడికి బారసాల.

సోద్యాల సోమక్కకి వైద్యాల మొగుడు.

అన్యాయపు పట్టణంలో ఆలి మొగిడికి రంకు.

అబద్ధాల పంచాంగానికి అరవై గడియల త్యాజ్యం.

దెయ్యాన్ని చూచి భయపడి శవాన్ని కౌగలించుకున్నాడట.

మాచకమ్మ సమర్త హస్త ఐతేఏమి, చిత్త ఐతేఏమి ?

కన్నదానికి యతి లేదు, దున్నపోతుకు మతిలేదు.

పసుపుకొమ్ము పెట్టనివాడు బజారంతా ధారపోసాడట.

# '...సుఖంగా ఉన్నావుకదా!'

[ చిన్న కథ ]

'వీస్తోన్న చల్లనిగాలికి నాదగ్గరి వేపచెట్టుమీంది కొమ్మలు ప్రియుల చక్కిలిగింతలకు త్రుళ్ళిపడే యువతుల్ని అనుకరిస్తువి...రహస్యంగా ఉపభర్తను కూడుకోటానికి వెళ్ళే వగలాడిగుండె దడదడలాగ బడబడావచ్చేసింది వానజల్లు.'

రచయిత:

పురాణం కుమారరాఘవశాస్త్రి, బి.యే.

౧

నేను మా పుట్టింటికి వచ్చి నెలరోజు లయింది. మా అమ్మ నాచిన్నప్పుడే చనిపోయింది. సోదరులు లేనేలేరు. మా నాన్నగారు ఒక్కరే ఉన్నారు. అరవైయేళ్ళ వృద్ధుడు. రెండువందల యాభై రూపాయల పెన్షను వస్తుందాయనకు. వయసులో చాల వైభవంగా బతికినవారు. ఈ జరావస్థలో వంటావిడ, మరి ఒకరిద్దరు నౌకర్లూతప్ప ఆయనకు ఉపచారం చేసేవాళ్ళెవరూ లేరు. అందుచేతే ఆయనకు కొంచెం సుస్తిగాఉందని ఉత్తరం రాగానే మావారు నన్నుపంపించారు.

నేను వచ్చిన వారంరోజులకే మా నాన్నగారికి బాగా కులాసాయిచ్చింది. కొంచెం నీరసంగా ఉంటున్నారు, అంతే. నేను తిరిగి వెళ్ళాలని అనుకుంటూనే ఉన్నాను. పంచమి, సప్తమి, దశమి అని గడువులు పెడుతూ రోజులు గడుపుతున్నారు మానాన్న. రమ్మని మావారు ఉత్తరమేమీ రాయలేదు కాని—వారి మనస్సు ఎంత సుతిమెత్తనో శరీరమూ అంతే. హోటలుతిండి సరిపడుతున్నదో, లేదో!

రోజూ సాయంత్రమప్పుడు కొంచెం వ్యాయామంగా ఉంటుంది కదా అని మానాన్న అటు పొలాలవైపో, పార్కులోకో షికారు వెళుతూంటారు. తరచు నన్నూ రమ్మంటూండేవా రాయన.

షికార్లు వెళ్ళట మనేది నాకు చిన్నతనంలోనే పోయింది. నేను కాపురానికి వెళ్ళిన ఈ పదిసంవత్సరాలనించీ ఎవరేనా పిలిస్తే పేరంటానికి వెళ్ళవలసినప్పుడు తప్ప గడపదాటి యెరగను. మావారు రికార్డ్యూ ఇన్‌స్పెక్టరుగా పనిచేస్తున్న ఊరు బస్తీ పల్లె కాకండా ఉంటుంది. అక్కడ పార్కులంటూ ఏమీ లేవు. అది కాక స్త్రీలు షికార్లు వెళ్ళటం చాల నింద్యంగా పరిగణింపబడే వాతావరణం అక్కడ.

అలవాటు లేకపోవటం మూలాన నాకు చాల భిడియంగానే ఉండేది, అనేకమంది పురుషులు వచ్చి కూచుని ఉండే ఆ పార్కులో మా నాన్నగారి పక్క నడుస్తోన్నప్పుడు. కొంతమంది స్త్రీలుకూడా—పెద్దపెద్ద ఉద్యోగస్థుల భార్యలూ, కూతుళ్ళూ వచ్చేవాళ్ళే. కబుర్లు చెప్పుకుంటూనో, పిల్లల నాడిస్తూనో, కిలకిల నవ్వులతో గాలితరంగాల్ని నింపుతూండేవారు. నాకుమాత్రం ఏమిటో భయంభయంగా ఉండేది. మా నాన్నగారి కులాసాకోసం కాకపోతే నేను వెళ్ళకపోయే ఉందును.

వెళ్ళినా నలుగురూ ఉన్నచోట కూచునేవాళ్ళం కాదు. ఆ పార్కు చాలపెద్దది. విజనంగా ఉండే ఒకమూల వేపచెట్టుకింద సిమెంటుబల్ల మాకోసం రిజర్వుచేయబడినట్టు ఎవరూ అక్కడికి వెళ్ళేవాళ్ళు కాదు.

మొదటిరోజున ఆ సిమెంటు బల్లమీద మానాన్నగారి మాటలకు జవాబులిస్తూ కూచున్నానే గాని తలెత్తి చూడలేకనే పోయాను. క్రమశః మనుష్యులకేసి చూడగలిగిన ధైర్యం లేకపోయినా కాస్త ఆ 'రేడియో లౌడ్‌స్పీకర్ల'కేసి, చెట్లకేసి చూపులు పోనిచ్చాను. చివరకు పార్కులోకి రావటం అంత భిడియపడవలసిన పని కాదని తెలుసుకోగలిగాను.

౨

అనాడు ఆ వేపచెట్టుకింది సిమెంటు

బల్లమీదనే కూచున్నా వెళ్ళి. కూడా వచ్చిన నాన్నగారు ఎవరో స్నేహితుడు కలిస్తే ఆయనతో మాటాడుతూ రేడియో రిసీవింగు స్టేషనులోకి వెళ్ళారు.

ఆకాశంనిండా మేఘాలు కమ్మి ఉన్నై; వర్షం కురుస్తుందేమో అన్న భయం కలిగించేటంత నల్లగా మాత్రం లేవు. సూర్యాస్తమయ మయ్యేవేళ. సూర్యుడు కనిపించటంలేదు: ఆ పశ్చిమభాగమంతా తెల్లని యవనికలాగ ఉంది. ఆకాశాన అక్కడక్కడ కొన్ని పక్షులు రెక్కలు కదల్చకుండా మందసంచారం చేస్తున్నవి. వీస్తోన్న చల్లని గాలికి నా దగ్గరి వేపచెట్టుమీది కొమ్మలు ప్రియుల చక్కిలిగింతలకు త్రుళ్ళిపడే యువతుల్ని అనుకరిస్తున్నవి. నాకప్పుడొక వింతైన పాట వినిపించింది—

"నీలిమాకాశ సౌధాన
నెల నెలంత
నవ్వు వెన్నెల వలచి—పొంగా
రుచున్న
అశ్రు జలరాశి బడి, ఈదులా
డుకొనుచు
అరుగుచున్నాను యామ్యాల
యమున కకట!"

రహస్యంగా ఉపభర్తను కూడుకోటానికి వెళ్ళే వగలాడి గుండె దడదడలాగ బడబడా వచ్చేసింది వానజల్లు. పాటలోని కరుణ వేదనకు ఖేచరుల కన్నీటి ముత్యాలా, వాన చినుకులా? తటపట శబ్దించినై చెట్లఆకులమీద.

ఇంతలో మెయిలు తెర విడిపోయి సూర్యబింబం ప్రకాశమానమయింది. వానజల్లు చరచరా దాటిపోయింది. పరిణతాతపప్రవాహంలో సుస్నాతములై బాల వృక్షాలు విరాజిలుతున్నవి. ఒక రంగురంగుల మెట్టతామరపూవు తుమ్మెద పాట వింటూ లజ్జ నభినయిస్తోంది. రాగరంజితమై కనిపిస్తోంది వాతావరణం.

3

ఆ తగ్గుస్థాయిలో అంత మధురంగా ఆపాట పాడింది ఎవరు? వెనక్కుతిరిగి చూచాను. కొంచెందూరాన ఒక ఎలెక్ట్రిక్ స్థంభానికి ఆనుకుని అటు ముఖం పెట్టి కూచున్నాడెవరో. నాకు నీడ యిస్తోన్న వేపచెట్టుమీది ఆకుల సందుల్లోనించి రెండు చల్లని నీటి చుక్కలు నా చెక్కిలిమీద రాలిపడ్డవి. తుడుచుకుని మళ్ళీ సరిగా తిరిగి కూచున్నా.

ఛందోబద్ధములైన మధురశబ్దాలలోనూ, ప్రకృతి సౌందర్యంలోనూ, ఎంత

# విజ్ఞాన విషయాలు

గర్జించేటప్పుడల్లా సింహం తన తలని నేలకుదగ్గరగా వుంచుతుంది.

* * *

సాధారణంగా మానవుని శరీరంలో ఎల్లప్పుడూ 98.6 డిగ్రీల వేడి వుంటుంది. కప్పవంట్లో వేడి 48 డిగ్రీలు మాత్రమే.

* * *

ప్రపంచంలోకల్లా ఉన్నతస్థలంలోవుండే పట్టణం లాపాజ్. అది దక్షిణ అమెరికాలోని బొలివియాకు రాజధాని. సముద్రమట్టానికి 12,470 అడుగుల ఎత్తునవున్న కొండమీద ఆనగరం కట్టబడింది.

* * *

అసలు ముత్యాలు చేతముత్యాలకంటె గట్టిగా వుంటాయి.

* * *

ప్రతి బ్రిటిష్ పౌర చతుష్టయంలోనూ ఒకడు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఇండియావల్ల జీవిస్తున్నాడని సర్ విలియమ్ జాయిన్‌సన్ హిక్సు చెబుతున్నాడు.

* * *

లండన్‌లోని కుక్కల జనాభా ఐదులక్షలని అంచనా వేయబడింది.

* * *

రష్యన్ జారులలో భయంకర బిరుదాంకితుడైన ఇవాన్ అనే పేరుగలవాడు తాను చేతికర్రగా ఉపయోగించే ఇనపబెత్తంతో పొడిచి కన్నకొడుకుని చంపాడు.

* * *

ఇంగ్లీషుభాషలో ఇ అనే అక్షరం అన్ని అక్షరాలకంటె ఎక్కువగా ఉపయోగింపబడుతుంది.

* * *

బుధకుజ గ్రహాలకు మధ్యనువున్న చిన్నగ్రహాలన్నీ ఒకనాటి పెద్దగ్రహపు శకలాలైవుంటాయని పలువురు శాస్త్రవేత్తలు అభిప్రాయం.

* * *

ఒకటిన్నర అంగుళముల దళసరిని నీటిమీద తేలే మంచుపలకమీద మనిషి నిలబడవచ్చు. ఐదు అంగుళాల దళసరి మంచుపలకమీద గుర్రంసహా బండి మునిగిపోకుండ నిలబడవచ్చు.

ప్రభావం ఉంది? అబోధపూర్వములైన జనాంతర సౌహృదాల్నీ కూడా స్మరింపజేస్తాయి. నా మనస్సు మంచు తెరలు చీల్చుకుంటూ స్మృతిపథంలో పరుగిడుతోంది. ఆగింది ఒకచోట చటుక్కున...

...మొదటి రీల్—స్కూలుకు వెళ్లే దోవలో ఒక చిన్న సందు. రఘువుండే యిల్లు అక్కడే. స్కూలు ఫైనల్ కుర్రాడు; బాగా ఆడతాడు ఫుట్ బాల్. రెండుమూడు మెడల్సు ఉన్నాయి అతనికి...చేతిలో ఒక కాగితం పట్టుకుని వాళ్ళగుమ్మందగ్గిర నిల్చుని ఉన్నాడు...

ఆకుపచ్చ సిల్కుపరికిణీ మీద గులాబిరంగు వలెవాటుతో—చేతిలో థర్డ్ ఫారం పుస్తకాలు పట్టుకుని వస్తోంది వీణ. ఆ మధ్యాహ్నపు ఎండకు నుదుటి మీద చెమటచుక్కలు చెదరినవి.

'ఇదిగో, వీణా !'

ఇదివరకెన్నడూ రఘువు తన్ను పలుకరించలేదు. సిగ్గొచ్చింది వీణకు. బుగ్గలు జేగురించినవి. నడక మందగించింది.

రఘువు మెట్లుదిగివస్తూ 'మరేంలేదు; ఈ సెలవుచీటి కొత్త హెడ్మాస్టరు గారి కిచ్చివెయ్యి. ఇందాకటినించీ చూస్తున్నాను; ఏ కుర్రాడూ కనిపించలేదు. ఇవాళ తలనొప్పిగా ఉంది; స్కూలుకు రాలేను'' అంటూ కాగితం అందించాడు.

తను తీసికెళితే బాగుంటుందా? అన్న ప్రశ్న వచ్చిందిగాని, వీణ ఆచీటి అందుకోకండా, నిరాదరణగా సాగిపోలేకపోయింది. ఆమె చీటితీసుకుంది. జడలోని చేమంతిపూవొకటి కింద వాలింది; రఘువు అది వొంగి తీసుకుని ఆఘ్రాణిస్తూ ఇంటోకి వెళ్లాడు.

... ... ...

రెండో రీల్ : జిమ్ఖానాక్లబ్బు ఆవరణలో ఫుట్ బాల్ పోటీపందేలు జరుగుతున్నై. ఆరోజున రఘుకు 'రౌండు' లేదు. వాలంటీరుపని చేస్తున్నాడు. వీణా, ఆమె తండ్రీ ఆట చూచేందుకు వచ్చారు. ఎంత మర్యాద చేస్తున్నాడు రఘు వాళ్లకు; తన యిల్లు కాకపోయినా. ఆమర్యాద! ఆస్వాగతం! అనేకమంది వస్తున్నారు; వాళ్లంతట వాళ్లే ఖాళీగా ఉన్న కుర్చీలలో కూచుంటున్నారు. రఘు ఆ తండ్రీ కూతుళ్లకు ఎదురు వెళ్లాడు; తీసుకొచ్చి ప్రత్యేకాసనాలు చూపించాడు; సోడాలు కావాలేమో అడిగాడు. ఆయన పెద్ద గవర్నమెంటు ఉద్యోగస్థుడవటంచేత అంత మర్యాద జరుగుతోందనుకున్నారంతా. 'వీణను చూచేసరికి మనవాడెలా అయినాడో చూచావుట్రా' అంటున్నాడు రఘుతరగతివాడొకడు పక్కని స్నేహితుడితో. 'స్కూలు ఫైనలు అయ్యాక వాళ్ళింటో బట్లరు ఉద్యోగమే మనవాడికి' అని రెండోవాడి ప్రతివచనం. వీణ వాళ్లిద్దరికేసి చురుగ్గా చూచి తలవొంచుకుంది.

... ... ...

మూడోరీల్: తూర్పువేపు ఆకాశాన బారెడుమాత్రం ఎక్కివచ్చిన సూర్యబింబం దర్శనీయంగా ఉంది. జడ వేసుకుని, నీళ్లుపోసుకుని, గళ్లపరికిణీ గోధుమరంగు పమిటా సింగారించుకుని, వీణ వాళ్ల పెరటితోటలో పువ్వులు సేకరిస్తోంది. వనస్పతులు తమంతతామే గాలికి వొంగి పువ్వులందిస్తున్నై. బైటనుంచి...

'వీణా !'

ఆమె ఉలికి పడ్డది. ఎవరది? గోడ అవతల వీధిలో రఘును చూచింది వీణ. పుష్పాపచయం మానేసి, తలెత్తి.

'నువ్వా? రఘు! లోపలి కొస్తావా? ప్యాసయ్యావు కామాలు; ఉద్యోగ ప్రయత్నంమీద మా నాన్నగారితో మాట్లాడ్డానికేనా? వున్నారు ఇంటో'

రఘు నిశ్శబ్దంగా ఆమెకేసి చూస్తూ వుండిపోయాడు.

'ఏమిటో విచారంగా వున్నావే!'

'ఏమీలేదు...మీరు రేపేనా ప్రయాణం?'

'ఔను, రేపు సాయంత్రం నాలుగు గంటలబండికి. మా నాన్నగారికి బదిలీ అయిందిగా!'

'వచ్చేసంవత్సరం ఫోర్తు ఫారం ఇక్కడ చదవ్వన్నమాట!'

'ఊహుఁ, అక్కడే...లోపలికి రా. భయంలేదు.'

'నాకు పువ్వులు కావాలి.'

వీణ పక్కున నవ్వింది...

'ఎందుకు నీకు పూలు?'

రఘు మాటాడలేదు. గంభీర మౌనముద్ర!

'ఏం జేసుకుంటావు పువ్వులు ?'

'కావాలి.'

'మా చెల్లెలి కిస్తావా? నీకు చెల్లెలుందా అసలు ?'

ఇంతలో...

'అమ్మా! వీణా!' ... లోపలినించి కేక.

'అదిగో మా నాన్నగారు పిలుస్తున్నారు, వెళ్లాలి'...వీణ వెళ్లిపోడానికి వుద్యుక్త అయింది.

'పువ్వు లియ్యవూ మరి ?'

‘నీకెందుకు లెద్దూ పూలు!’ అని వీణ గబగబా వెళ్లింది. ఒక్కసారి మాత్రం వెనక్కి తిరిగిచూచింది. ఎంతదీనంగా, కళావిహీనంగావుంది అతని ముఖం!

మళ్లీ ఇన్నాళ్లకు ఆ కళావిహీన ముఖమే ఇవాళ...

—సినీమాదృశ్యాలు ఆగిపోయి... మా నాన్నగారు వస్తున్నారేమోనని చూచాను రేడియో రిసీవింగు స్టేషనుకేసి. ఆయన ఇంకా మిత్రుడితో మాటాడుతు నే వున్నారు కామాలు లోపల.

ఇంతలో నా వెనుక ఆ ఎలిక్ట్రిక్ స్తంభం దగ్గరి వ్యక్తి లేచాడు. అతని ముఖం కనిపించింది. ఔనా, కాదా, అన్న సంశయం ఎంతోసేపు లేదు.

ఆ కళా విహీనముఖమే పన్నెండేళ్ల తరువాత ఇవాళ మళ్లీ చూస్తున్నాను.

వెళుతూ వెళుతూ నేను కనిపించగానే ఆగాడు. పోయినప్రాణం లేచి వచ్చినవాడులాగ అయి ‘ఎవరు? వీణా!’—మాటలు కావవి. ఆవేశపూరితమై పగిలిపోయిన గుండె తునకలు...

‘ఔను, నేనే.’ సిమెంటు బల్లమీదినించి దిగి నమస్కారం చేశాను.

అతడు నన్ను సమీపించాడు. అతడు నాకేసి చూచే చూపులలో పాల సముద్రం పొంగుతోంది; ఒక నిమిషంకింద నిస్తేజమై వుండిన అతని ముఖమండలం చంద్రబింబాన్ని బురుడిస్తోంది.

‘సుఖంగా వున్నావుకదా వీణా!... ఈ వూళ్లో వుంటున్నారా?... మీవారు ...ఏం పని?...’

టూకీగా చెప్పాను: మానాన్నగారు రిటైరు అయింతర్వాత ఈ వూళ్ళో నే... అన్ని సౌకర్యాలూ వున్నాయని... ఇల్లు కట్టుకుని వున్నారనీ, ఆయన కీమధ్య సృష్టి చేసినందున చూచిపోయేందుకు వచ్చాననీ—ఇంకా—

‘నువు చాల మారిపోయావు వీణా. నా మనసులో వున్న ఓ అప్పటి ధర్మాకారం వీణ మారేలేదు. అందుచేతే చప్పున గుర్తుపట్టలేక పోయాను. ఊం కులాసాగా వున్నావు కదూ!’—ఇంకా ఏమిటో కావలసినంత చెప్పాలనుకుంటూ... చెప్పలేని మూగవాడువలె—ముఖంలో వివిధభావశబలత దాంతట అది ప్రకట మాతూ వుండగా... నాకేసే చూస్తూ నిల్చిపోయాడు.

నే నతని ముఖంలోకి చూళ్లేక చూపుల్ని అతనిచేతిలోని పుస్తకంమీదికి దించాను. ఆతని భావతీవ్రతకూ, నాభావాసహ్యతకూ, రవంత విశ్రాంతి కలిగిద్దామన్న తలపుతో నేనువాక్కు తెచ్చుకుని...

‘ఆ పుస్తకం...’

అర్ధోక్తిలోనే అత డందుకుని... “ఈ పుస్తకమా! ఇది ‘ఎండిమియాన్’ అని ఒక ఇంగ్లీషుకావ్యం. ‘కీట్సు’ కవి రాశాడు. ఒకడు చంద్రబింబాన్ని వరించి, దానికోసం తహతహపడి, హతాశుడై మరణిస్తాడు—అదీ ఇందులో కథా వస్తువు. ఇది నా నిరంతర పారాయణ గ్రంథం” అన్నాడు.

ఒక నిమిషంసేపు ఎవరమూ మాటాడలేదు. ఒక పెద్ద గాలికెరటం వృక్షశాఖల్ని రివ్వన ఊగించి దాటిపోయింది.

“ఇక నేను వెళ్తాను వీణా! ఎన్నాళ్లకు కనబడ్డావు! ఇవాళ సుదినం. నా హృదయంలోని హిమాలయ పర్వత గహ్వరాల్లో విద్యుత్కాంతులు ప్రజ్వలిస్తున్నట్టు అనుభవిస్తున్నాను. వెళ్లనా? నువు సుఖంగావున్నావుకదా...!”

నేను తలెత్తి అతని కన్నులలోకి చూచాను, మిలమిల మెరుస్తోన్నవి అవి ...దీపశిఖ అంతిమకాంతివలె.

నా నమస్కారం అందుకుని వెళ్లిపోతున్నా డతను. నేను అటుకేసే చూస్తూ స్తంభీభూత నయాను.

ఇప్పటికీ నాకావాక్యం చెవులలో ధ్వనిస్తోంది: ‘నువు సుఖంగా వున్నావు కదూ!’

---

# కోర్కెలు

౧

నీ చరిత్రంబెల్ల
నిండు మోదముతోడ
గానంబుసేయగా
గావింపుమయ్యనన్
కవికుమారుడనుగా!

౨

నిఖిల జగములలోన
నీ లీలలెల్ల స్మ
రించుచు చిత్రముల్
చిత్రంబుసేయగా
చేయుమయ్యానన్ను, చిత్రకా
రుడనుగా!

౩

నీదు సచ్చరితంబు
నిఖిలజగములలోన
నిలిపి పాపముబాప
నీభక్తకోటిలో
తావునా కొసగుమో
తామరసనేత్ర!

—మల్యాల వేంకటశివరామకృష్ణ

# మేతవేస్తే అంతామేతే

వినోదవ్యాసం

నైవేద్యం అనే పేరుతో భగవంతుడికి—
లంచం అనే పేరుతో ఉద్యోగికి—
కానుకలనే పేరుతో ఇతరులకి—
మేతలు పసందుగా అమరివున్నాయి.
నేడు మేతవేసేవాడే మహాత్ముడౌతున్నాడు.

రచయిత :

కొత్తపల్లి శ్రీరామమూర్తి, యల్.యమ్.ఇ.

మాది ఒక పెద్ద పశువులమంద. ఆ పెద్దమందని మళ్ళ తోలుకు రావడానికి ఒక బొడ్డువూడని కుర్రవాడిని కుదిర్చాడు మా బాబు. పశువులమంద పెద్దదవడంచేత ఆ కుర్రవాలేరు తిన్నగా కాయలేక పోయేవాడు. దూడలు తరుచు మంద తప్పి పోయేవి.

మా అన్నగారికి కోపమేరాదు. వస్తే అతన్ని పట్ట పగ్గాలు వుండవు. ఒకనాడు మాఅన్న ఆ పసులకాపరిని పట్టుకుని ప్రక్కలు విరగ తన్నాడు. బ్రతికివుంటే బలుసాకైనా నమలవచ్చునని వాడు కమతానికి నీళ్ళువదిలేశాడు.

మరునాటినుంచి మూడురోజుల దాకా దూడలు కట్రాటలనే వుండి పోయాయి.

నాలుగోరోజు మొదలుకొని మాఅన్న ఆజ్ఞమీద నేను పసుల కాపరిని అయ్యాను. మనుష్యులకన్నా పశువులు విశ్వాసంగల జంతువులని చదువుకోవడంవల్ల నేను వాటి విశ్వాసం సంపాదించడానికి ఆపశువులను మంచి పచ్చిక దొరికే స్థలాలకి తోలుకొనిపోయి మేపేవాణ్ని. రావిరొట్ట, జువ్విరొట్ట కొట్టి మేపేవాణ్ని. మంచిమేత దొరకడంవల్ల పశువులు పూర్వంలా మందవిడిచి పోయేవికాదు. రోజూ బాగా మేసి డొక్కలు నింపుకునేవి.

పాలికాపు కాసేరోజుల్లో దూడలన్నీ తలోకదిక్కుకీ పారిపోతూ-యిప్పుడు అట్లా పోకపోడానికి మేత బాగా దొరకడమే కారణమని తేలిపోయింది.

అంటే మేతలో యింత మహాత్మ్యం వుందన్నమాట.

చిన్నప్పుడు బళ్లోకి వెళ్లేసమయంలో మా అమ్మ నాజేబులో పోసిన పాలకాయల్లో రెండు ఒకసారి ఒక కుక్కకు వేశాను. అది చచ్చేదాకా నన్నుచూచినప్పుడల్లా తోక ఆడిస్తూ నాచుట్టూ ప్రదక్షిణం చేసేది.

ఈరెండు విషయాలు స్ఫురణకు వచ్చినప్పుడల్లా మేతలోని మహాత్మ్యమిట్టిదా అనిపిస్తుంది నాకు.

నేడు మేత వేసేవాడే మహాత్ముడౌతున్నాడు.

బాగా మేతవేస్తేనే భర్తను భార్య ప్రేమిస్తుంది.

నటకురాలికి బాగా మేతవేయిస్తాడు కనుకనే డైరెక్టరుగారు ఏంచేయమంటే దానికే ఆమె వూ ! అంటుంది.

చిన్న ఉద్యోగి పెద్ద వుద్యోగికి మేతవేస్తేనే ప్రమోషన్‌లు వస్తాయి.

మేతవేస్తే మంత్రులు మనవారై పోతారు.

గడ్డిపడేస్తే గాడిదలుకూడా తన్నడం మానేస్తాయి.

ప్రభుత్వాలకుగాని, సంస్థలకు

గాని మేతవేస్తే మనకు బిరుదులు వస్తాయి.

పెండ్లిళ్ళలో మేత, సభల్లో మేత, పేరంటాల్లో మేత. ఎక్కడ మేత ఎక్కువేస్తే అక్కడ శోభ ఎక్కువ. మేతవేసేవాడే ఘనుడు. మేత బాగావున్నవాడే యుద్ధంలో విజేత— మేతలోనేవుంది ప్రపంచమంతా.

మేతకు అధిష్టానదేవత లక్ష్మి. లక్ష్మీనాథుడు కనుకనే త్రిమూర్తుల్లో విష్ణుమూర్తి స్థితికారకుడు. అదిలేని మిగతా ఇద్దరిలో ఒకడు యంబ్రహ్మ అయినాడు; రెండవవాడు విభూతిరాయడు అయినాడు.

అహల్యాజారుడైన సహస్రాక్షుడు నూరు యాగాలుచేసి అందరకూ మేతవేసి దేవేంద్రుడైనాడు.

ఎన్ని వెధవపనులుచేసినా పైవారికి క్రిందవారికి యింత మేత పడేస్తే ఆ వెధవపనులన్నీ అరిగిపోతాయి.

మేతవేస్తే ధర్మాలు అధర్మాలయిపోతాయి. అధర్మాలు ధర్మాలైపోతాయి. విష్ణ్వాంశతో పుట్టిన శ్రీకృష్ణుడు పదహారువేల గోపికల్ని చెరిపినా, ఎనమండుగురు పట్టమహిషుల్ని వుంచుకున్నా, అత్తయిన రాధను తగులుకున్నా ఎవడూ నోరెత్తలేక పోయేడు.

విభూతిరాయడు ఏదో పొరపాటున తనంతదా వలచివచ్చిన గంగమ్మకోసం కక్కుర్తిపడ్డాడని ఈసడిస్తూ అది నీకెందుకు నాకు కావాలి విడచిపెట్టనోయి అని శ్రీనాథుడు శివున్ని ఇట్లా ముదలకించాడు.

'సిరిగలవానికి చెల్లును
తరుణులు పదియారువేలు తగ పెండ్లాడన్
తిరిపెమున కిద్దరాండ్రా ?
పరమేశా! గంగవిడుము పార్వతిచాలున్'

మొత్తంమీద ప్రపంచంతెరిచి, తరిచి చూస్తే అన్నిటికీ మేతే ప్రధానం అని తోస్తుంది.

మానవునికి ప్రధానావసరాలుగా పెద్దలు ముఖ్యంగా మూడు పేర్కొంటారు. అవి ఏమిటంటే ఆహారం, నిద్ర, మైదునం.

దీనినిపట్టి కూడా మేత ప్రధాన

# ఎన్ని యేళ్లు వచ్చినా

తిరుగుతూవుండడమే నీకు ప్రియమైవుంటే—

ఉన్న ఉద్యోగం ఊడిపోతే మనగతి ఏమిటిఅనేభావం నీకు కలగకుండా వుంటే—

కొత్తసంగతులు తెలుసుకోవాలనే కుతూహలం ఉంటూ వుంటే—

ఎక్కడికేనా యాత్ర తలపెట్టి ఇప్పుడు తొందరఏమిటి మరి ఒకప్పుడు పోవచ్చునని అనుకుంటే—

చిన్నవాళ్ళతో మాట్లాడే సందర్భంలో 'నేను నీ వయస్సువాడినైవున్నప్పుడు' అని అనకుండా ఉంటే—

నీవు ఇన్నాళ్లుగా సంపాదించిన అనుభవం నీకు ఉపయోగించకుండావుంటే—

## నీవు యువకుడవే.

# మన యెదగడం

ఆరోగ్యవంతమైన బిడ్డ ఆరు మాసాలికి రెట్టింపు తూకాన్ని పెంచుతుంది.

పుట్టినప్పటినుండి మూడేళ్లునిండే సరికి ఆబిడ్డతూకం నాలుగురెట్లు అవుతుంది.

బిడ్డ వరసక్రమాన్ని ఎదగదు. అప్పుడప్పుడు ఉబ్బెత్తుగా ఎదుగుతూవుంటుంది.

మగపిల్లలు 17-వ ఏటనూ, ఆడపిల్లలు 14-వ ఏటనూ ఏఒక్క సంవత్సరంలోకంటె ఎక్కువగా ఎదుగుతారు.

15 ఏళ్ళకి ఆడవాళ్లు ఎంత పొడుగువుంటారో అంతే. ఇక ఆ మీద వాళ్లు పొడుగు ఎదగరు. తూకం విషయంలోమాత్రం ఇరవై ఏళ్లు వచ్చేవరకువాళ్లు పెరుగుదల చూపిస్తారు.

పిల్లలు ఎదగడం ఋతువుల్ని పట్టివుంటుంది. వసంత, గ్రీష్మ ఋతువుల్లో అనగా ఏప్రెల్ మాసం మొదలు జూలై మాసంవరకు వారు బాగా ఎదుగుతారు.

మగపిల్లలు ఇరవై ఏళ్ళకు బాగా పొడుగు ఎదుగుతారు. అంటే ఆ మీద వారు ఇక పొడుగు ఎదగరన్నమాట.

స్థానం ఆక్రమిస్తోందన్నమాట.

ఏది లేకపోయినా వుండకలడు కాని మానవుడు మేతలేకండా వుండలేడు. ఒక్క మానవుడేకాదు జీవకోటికంతకూ అది అత్యావశ్యక. దానికోరకే ప్రాకులాట. అది పుష్టిగావుంటే ఏకంచెలూ, గోడలూ దాట నక్కరలేదు.

తనకుండడమే కాకుండా యితరుల కింత మేతవేయగలిగినవాడే నాయకుడు. అతడే రాజు. అతడే విష్ణ్వాంశాసంభూతుడు.

మేతకి లోబడంది ఈ ప్రపంచంలో లేదు.

ఒకసారి భగవంతుడుకూడా మేతకు లోబడి రామదాసు సేవకు ఋదురుకొన్నట్టు చదువుకొన్నాం.

భీష్ముడు, కర్ణుడు మొదలగు యోధానయోధులు మేతకు లొంగిపోయే యీ దేహాలు నీవుప్పు తిని పెంచినవి కనక నీచిత్తమొచ్చినట్టు చేసుకోమని రారాజుకి అర్పించారు—

మహా మహా దేవతలుకూడా హవిస్సులకు ఎదురుచూస్తూ వుంటారు. అట్లాంటి అతిరథ మహారథులే మేతకు లొంగిపోయారంటే యీ పిదపకాలంలో మేతకు లొంగనివా రెవరు?



## మహావాక్యరత్నాలు

బద్ధకం విచారం అనే కుదుటికి చెందింది. ...

కష్టం అనేది బద్ధకంయొక్క కూతురు. ...

మానవుడు ప్రేమించడంకంటె ద్వేషించడం గాఢతరమైవుంటుంది. ఒకసారి ఒక మానవునిహృదయంలో ద్వేషాన్ని పొదుకొలిపామంటే దానిని మరలించడం కష్టం. ...

యుద్ధంయొక్క పర్యవసానం శాంతి ఐనట్లే బద్ధకంయొక్క పర్యవసానం చురుకుతనమై ఉంటుంది. ...

జ్ఞానమనేది రెండువిధాలు : ఒకవిషయమై మనకే తెలిసివుండడం- లేదా ఆ విషయకమైన భోగట్టా ఎక్కడ దొరుకుతుందో తెలిసిఉండడం. ...

—*DrJ ohnson*

డబ్బులేని మనిషి దరిద్రుడే. డబ్బుమాత్రమేగల మనిషి అంతకంటె దరిద్రుడు. ...

—*Rev Bartlett*

దుష్టత్వం అనే చెట్టుయొక్క తల్లివేరు తెగగొట్టడానికి ఎప్పుడుకాని ఒక్కడే ప్రయత్నిస్తూవుంటాడు. దాని కొమ్మలు కొట్టివేయడానికిమాత్రం పలువురు ప్రయత్నిస్తూవుంటారు. ...

—*Thoreau*

సలహా ఇచ్చేవానికంటె దానినిపుచ్చుకుని ఆప్రకారం చేసేవాడు ఒక్కొక్కప్పుడు గొప్పవాడైవుంటాడు. ...

—*Von Knebel*

నీప్రార్థన ఆలించి పాలించడానికి భగవంతుడికి కొంచెం గడువు ఇయ్యి.

—*Anon*

# నెల్లూరు నెఱజాణాలు * * రాపూరు రసికులు

కొన్ని కొన్ని ఊళ్ళు కొన్ని కొన్ని విషయాలకు ప్రసిద్ధాలయి వుంటాయి. బందరు బడాయికి, గుంటూరు లడాయికి ప్రసిద్ధి అనే నానుడివుంది. అల్లే నెల్లూరు నెఱజాణలకు, రాపూరు రసికులకు చిర ప్రసిద్ధమైవుంది. ఈ వ్యాసం ఆవిషయాన్ని కొంత ప్రస్తావిస్తూవుంది.

రచయిత :

## పురాణం పిచ్చయ్యశాస్త్రి

"నెల్లూరు నెఱజాణాలు – రాపూరు రసికులు" అనే వాడుక మాట తెనుగుసీమలో చిరకాలంగా వుంటూవుంది. దీనినిపట్టి ఆలోచిస్తే, పూర్వం నెల్లూరులో జాణకత్తెలైన స్త్రీలు వుండిరనీ, (అచటికి కొంతదూరంలో వున్న) రాపూరనే గ్రామంలో కడుంగడు రసికులైన పురుషులు వుండిరనీ తెలుస్తున్నది.

ఆజాణాలును, రసికులును తమ చాతుర్యముచేత ఒకరిని ఒకరు ఓడింపవలెననే ఉద్దేశంతో, అప్పుడప్పుడు ఒకరికొకరు ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుచు తమతమ నేర్పును గనబరస్తూవుండిరనీ, అట్టి జాబులలోని మాటలు గూఢముగా వుండెడివనీ కొందఱు పెద్దలు చెప్పగా విని అటువంటి జాబులను చూడాలనే ఆసక్తి గలవాడనై సంపాదించుటకు బ్రయత్నించాను.

ఇటీవల ప్రస్తాపవశమున నామిత్రు లొకరు తనవద్ద తాటాకులో వ్రాయబడిన అటువంటి జాబు ఒకటి వున్నదనీ, ప్రయత్నించిన యెడల మఱికొన్ని దొరకగలవనీ, తాను సాధ్యమైనంతవరకు ప్రయత్నించి సంపాదించియిస్తాననీ, వాగ్దానము చేసి, తనవద్దవుండిన తాటాకుజాబును వ్రాసికోడానికై ఇచ్చారు. నేను దానిని ఇక్కడ ప్రచురిస్తున్నాను.

* * *

నెల్లూరు నెఱజాణలకు రాపూరు రసికులు వ్రాసినజాబు.

నెల్లూరు నెఱజాణలకు రాపూరు రసికులు వ్రాసిపంపిన వైనం ఏమనఁగా మాలో పాములరాజు కొడుకైన నీటితలవానికి వర్తమాన కోతి సంవత్సరం, పరిక్షిత్తుతల్లి ఆయనం, దారితల మాసం మునులెక్క దివసం ఉపాధ్యాయుండి వారం ఏడుగుఱ్ఱాలవాడు కనుపడినది మొదలు ఆవస్థలగడియలకు లోపల భార్యాభర్తల లగ్నమందు మూడవకన్ను జరిగించుటకు ముసలివాళ్లు రెండుగడియల కాలమును నిర్ణయించినారు. దీనికిగా మీరు నాలుగుబుంగల గుమ్మడిపండ్లున్నూ, నాలుగు భాగముల బిందెలున్నూ, కోయక పెల్లగింపకుండా యొకబండి తోటకూర కాడలున్నూ, వండక తినే యాకులున్నూ- పదికట్టలు పీచుపండ్ల చెట్ల పత్రాలున్నూ- సిగ్గుతండులానికి నాలుగుముంతలు సింగం బియ్యమునూక పంపకోరినాము. మఱియు మాపూరి బావినీళ్లు ఉప్పగా వుంటున్నవి కనుక యీకార్యం అయ్యేవరకున్నూ మీరొక మంచినీళ్ళ బావినిపంపి, పాపంకొని దాన్ని కట్టుకోవలెనని కోరుచున్నాము.

ఇంతేసంగతులు.

* * *

దీనిభావ మేమి తిరుసులేశ ! పాఠకులు ఎవరైనా చెప్పకో గలరా? లేకపోతే వివరాన్ని మరుసంచికలో నేనే చెబుతాను.

Printed at the Andhrabhumi Printing Works, 13 Mukhatal Street. Vepery P.O, Madras.
Editor & Publisher : Andra Seshagiri Rao B.A.

